# పీఠిక.

ఇదివఱకు లోకులెఱింగిన రుక్మాంగద చరిత్రమునందలి సంవిధానమునకును దీనికిని బాల వ్యత్యాసము గలదు. సంవిధానమున నీవ్యత్యాసము గల్పించినందులకు గ్రంథకర్త గారే కారణముల నుడివియున్నారు. ప్రప్రథమమున నీనాటకము ప్రదర్శింపఁ బడినప్పు డీక్రింది విధమున నాచార్యులవారే కరపత్రములయందుఁ బ్రకటించియుండిరి

సాధారణముగ రుక్మాంగద నాటకము నాడని నాటక సంఘములే లేవు. కథయు జనులకంతయు దెలిసినదే. అయిన నందలి సంవిధానము మాత్రము కొంచెము చింతనీయము. రుక్మాంగదు నేకాదశీ వ్రతప్రభావమున జీవాత్మల తండము వైకుంఠము నకు పోవను ప్రారంభించి యమలోకమున నరకములు శూన్యములు కాగా యముడు నారదునితో కన్నులకు నీళ్లు పెట్టుకొని యేడ్చినది చాలక బ్రహ్మతో మొగబెట్టుకొని తన యమాధికారమునకు 'రాజీనామా' యిచ్చెదనని గోడు చెప్పుకోగా బ్రహ్మ మిక్కిలి వ్యసనపడి ఈ వ్రతము భంగము చేయుటకు మోహినియను కన్యకను పుట్టించి వ్రతము చెఱచెనని కథ. ఇదియే పలువిధములుగా నాటకకర్తలామోదించియున్నారు. నాటక కర్తలకు కథలోని బీజము మాత్రము వదలక స్వారస్యము కొరకు సంవిధానము కొరకు కథను పసనునకు వచ్చినంత మార్చుటకు స్వాతంత్ర్యముకలదు ఈ కథలో తివనరకము లకు జీవులు రాకపోయినంతనే కన్నీరుమున్నీరుగా నేడ్వవలసినంత యమునికి తాత లార్జించినంత గంటేమిపోయెనో? యముడు మొత్తుకొన్నంతనే నిష్పక్షపాత సృష్టి కర్తయగు బ్రహ్మకు రుక్మాంగదు సద్వ్రతము చెఱుప వలసినంత కార్పణ్యము పుట్టుటకు కారణమేమో—అంగుకు ఒక స్త్రీ పుట్టి రుక్మాంగదునియెడల మోహము లేక మోహించి మోసగించి క్రూరకృత్యముల చేయింప నుద్యమించిన యా నారీతిలక ప్రభావమెట్టిదియో యుక్తిశాలురందరును నూహింపవచ్చును. ఈనాటకమునగల సంవిధానము మార్పున కీక్రిందిపద్యము మాత్రమే చాలును. బ్రహ్మ యమునితో ముచ్చటించుచు "నీకేమైన కొదవగా నున్నదియా" యని యడుగగా—

సీ. "సతతంబుసంగీతసాహిత్యవిద్యల గారవించుటకవకాశమబ్బె
నతిశయంబుగమిత్రతతులతోడ వినోద గోష్ఠినుండుటకనువులమయ్యె
నెమ్మదిఁగడుభక్తినిండారమిముఁబోలు పెద్దలదర్శింపవేళగలిగె
నరుదారురీతిగా హరినామకీర్తనల్ దమిదీఱ సేయంగసమయమొదవె

నరసిచూడంగరుక్మాంగదావనీశు
సలలితైకాదశీవ్రతసత్ఫలంబు
నాకుమోదంబునకుఁగారణంబుగాక
వారిజాసన! కొదవకుఁగారణంబె".

మల్లనామాత్యకృత రుక్మాంగద చరిత్రమునందలి మనోహర పద్యములు పెక్కు లిందుఁ గైకొనఁబడియున్నవి.

# మోహినీరుక్మాంగదనాటకము.

## —: కథాసంగ్రహము —

### ప్రథమాఙ్కము.

1 అజాముసే [illegible] రాత్రము నారదునివలన విని రుక్మాంగదుడు ఏకాదశీ వ్రతము పట్టుట

2. ఏకాదశీ వ్రతమును గురించిన ముఖ్యప్రకటన

3 పచ్చిల [illegible] కులను నిరువురు సత్రకర్మకర్తలు పంచాపకేశ శాస్త్రియను మరొక [illegible] నుండి వచ్చిన యధికారిచే బలవంతపు ఏకాదశి చేయించుట

### ద్వితీయాఙ్కము.

1 [illegible] వినోదముగా వైద్యనాథుడను గంధర్వునితో చదరంగమాడుట. వారిసంభాషణము.

2. నందనవనములో రంభాదులయిన యప్సరసల సంగీత వినోదము. అసందర్భము [illegible]

3 రామ బ్రహ్మల సంవాదము. విష్ణు సేనానియగు విష్వక్సేనుడు వచ్చి వైకుంఠము వృద్ధిచేయుమని చెప్పుట అప్సరసలమొఱ

### తృతీయాఙ్కము.

1 రుక్మాంగదునిభార్య సంధ్యావళి గర్భముతోనుండుట. ఇష్టకామేశ ప్రభావమున నాయుమ జాడ్యము నివర్తించియుండినందున శివస్తుతి.

2 అప్సరసల నిర్ధారణము.

3 రుక్మాంగదు హరికథా కాలక్షేపము మోహిని యకృత్రిమ మోహము (మనోహరరంగము)

### చతుర్థాఙ్కము.

1 వింధ్యపర్వతములో నిష్టకామేశాలయము. మోహిని గానము రుక్మాంగదు మోహము (శృంగార రసప్రధానమైన రంగము). శివలింగము సుభయులు స్తుతించుట

2 రుక్మాంగదు భార్యల యాలోచన వారి నిర్ధారణము. మోహినీ సంధ్యావళుల స్నేహము (పాతివ్రత్యమును ప్రకటించు ధీరరంగము).

### పఞ్చమాఙ్కము.

1 రంభాదుల యాగ్రహము. మోహిని పశ్చాత్తాపము

2 రుక్మాంగదు ఏకాదశి నియమమువలని దుఃఖము. మోహినీ కార్యకృత్యము. ధర్మాంగదుని మహోదార్యము శ్రీవిష్ణు నాగమనము. స్తవము

— మంగళం ఉత్తరరంగము :—

శ్రీ

# మోహినీ రుక్మాంగద నాటకము.

---

ప్రథమాంకము-ప్రథమరంగము.

---

[ప్ర. రుక్మాంగదుఁడు. మంత్రి బలదేవుఁడు. పండితులు.]

(పండితులు శాస్త్రప్రసంగము చేయుదురు.)

రుక్మా—పండితోత్తములారా! మీ శాస్త్రసంవాదము మమ్మెల్లర నానందమగ్నులఁ గావించె. ఇప్పటికిఁ గడుంగడు సంతోషమయ్యె. ఇఁక విరమింపుఁడు. సేనానీ! ఈపత్రిక కోశాధ్యక్షునియొద్దకుఁ గొనిపోయి యీపండితోత్తములకు బహుమతు లిప్పింపుము

(పైన మృదంగధ్వానము సంగీతరవము భేరీనిస్వనము వినిపించును.)

రుక్మా—ఆహా! ఏమి యీ మనోహరగీతము! కిన్నరగానమున్నట్టులున్నదే! ఎన్నఁడు వినియెఱుఁగము

[ప్ర. నారదుఁడు]

రుక్మా—(నారదునకు నమస్కరించి యుచితాసనమునఁ గూర్చుండఁ జేయును).

నార—రుక్మాంగద రాజేంద్రా! ఇట సుఖము గలుగుఁగదా?

రుక్మా—మునిశ్రేష్ఠులారా! మీరాక నన్నెంతయు ధన్యుఁ గావించె. కృతార్థుఁడనైతిని మునీంద్రా! ఇప్పటికిఁ గొంచెము సేపటికిముందు నాకాశమార్గమున నెన్నఁడు వినని మనోహరగానము వినిపించె. ఆ గాన మెంతయు వర్ణింపవచ్చును. అదియేమి గంధర్వగానమా? కిన్నరగీతమా? నాకానతీయ వేఁడెద

నార—ధరణీశా! అయ్యెడ నేను వచ్చియుండి నినుదర్శించుకొని పోవు కుతూహలమున నేనిక్కడకు నేతెంచితిని. అది యొక చిత్రకథ. కన్యాకుబ్జపురిలోనున్న [illegible] వినియున్నావుగదా?

రుక్మాం—ఆహా! వినియున్నాను. అతఁడు కులమును చెడినవాఁడై దొంగలతోఁ గూడి బహిష్కరింపఁబడి శిక్షితుఁడై వచ్చి, మరల దొంగలలోఁ జేరుకొని చౌర్యముఁ గావించి యధిక హింస యొనర్చుచు నారాజ్యమునకే వచ్చియున్నాఁడని మా యారక్షకుల యొక్కకడ వచ్చియున్నందున, నేను వందుననుఁ దగినభంగి రక్షణములొనర్ప నియమించి యున్నాను. అదిప్పుడేల?

నార—అయ్యో! అదియొక పెద్దకథ. అయ్యజామిళుని బోలిన పుణ్యవంతుఁడేకలుగఁడు. అతఁడు మరణముఁ జెందిన వేళ యమలోకమునకుఁ గొనిపోవలయునని యముఁడును దూతలును, విష్ణువును, సమకట్టివచ్చి యెట్టకేలకు భార్యతో నతని విష్ణులోకమునకేఁ గొనిపోయిరి. ఆకాలమున సంభవించిన కిన్నరగీతము, గంధర్వగానము, నప్సరో నాట్యమును, దేవదుందుభిధ్వానమును అవియే నీవువినినవి.

రుక్మాం—అహో! ఏమిచిత్రము? ఎంతయో పాపాత్ముఁడని యెంచఁబడు నయ్యజా మిళునకు విష్ణులోకప్రాప్తియా? ఇదియెట్లు సంఘటిల్లు? అతఁడొనర్చిన మహా పుణ్యమదియేమి?

నార—ధరారమణా! అతనిపూర్వజన్మ పాపఫలమువలన నతనికి మహాపాపుఁడని దుష్కీర్తి గలిగెఁగాక, యతనిఁబోలిన నిర్మలమానిసులు లభించుటరది. అదిగాక యెట్టిపాపము లెన్ని యొనర్చియుండినను, దనయంత్యకాలమందొనర్చిన పుణ్యమువలన సర్వపాపములు కొట్టువడిపోయె.

రుక్మాం—మునీంద్రా! అదియేమిపుణ్యము?

నార—ఎనలేని పుణ్యకార్యము మరణపువేళఁ బూన్నవ్రతంబుగ, నేకాదశీవ్రతము సలిపి ప్రాణోత్క్రమణసమయమున, నారాయణస్మరణ యొనర్చినాఁడు.

రుక్మాం—మునికులతిలకా! నీమాటలవలన నిన్ను మరల మరల నడుగవలయునని యెంతయో కుతూహలంబు గలిగెడు. మేమందఱము నేకాదశినాఁ డుపవాసము చేయు చున్నారమేకదా? ఆయజామిళుఁడొనర్చిన ప్రతివిశేషమేమి? అనుగ్రహించి యానతిమ్ము.

నార—రాజేంద్రా! ఆయేకాదశీవ్రత మహాత్మ్యమింతని వర్ణింపసాధ్యమా?

సీ. పుణ్యమూర్తులలోనఁ బురుషోత్తముఁడువోలె
గ్రహములలో దివాకరుఁడువోలె
నంభోనిధులలోన నమృతార్ణవమువోలె
నగములలో మేరునగమువోలె

నాశ్రమంబులలో గృహస్థాశ్రమము వోలె
దరువులలోఁ గల్పతరువు వోలె
సకలదానములలో నన్నదానము వోలె
మణులలోఁ గౌస్తుభమణియుఁ బోలె

తే. గీ. స్వర్గమున భూమియందు రసాతలమునఁ
బ్రతియొనర్పఁగరానిసద్వ్రతము సకల
మంగళాస్పద మఖిలసంపత్కరంబు
క్షితితలేశ్వర! యేకాదశీవ్రతంబు.

అట్టి యేకాదశీవ్రతాచరణమున విధానములు వేలువేలుగా నున్నవి. ఏమనగా-

సీ. దశమినాఁ డేకభుక్తము చేసి మఱునాఁడ
హోరాత్రములు భక్తి నుపవసించి
హరిమందిరమునఁ జాగరమొప్పఁ గావించి
వేఁగినద్వాదశీవేళయందు
విప్రోత్తములకు షడ్విధరసోపేతంబు
గా భుజింపఁగఁ బెట్టి కనకవస్త్ర
తతులు దక్షిణలిచ్చి తగసంతసము సుహృ
జ్జనులతో నాప్తపుత్రకళత్ర

గీ. విరహితంబుగఁ బారణ వేడ్కఁ జేసి
నిద్రదివమెల్ల వర్జించి నియమపరత
మాపు భుక్త్యంగనాసంగమములు మాని
యుచితగతి నుండుటది యుత్తమోత్తమంబు

ఇది సంపూర్ణమగు నేకాదశీవ్రతము. దీనివలన సర్వపాపములు నశించు. మహాక్షేత్ర దర్శనపుణ్యము లెన్నియో లభించు.

రుక్మాం—మునీంద్రా! ఈదినమె సుదినము. నీవలన నీపుణ్యకథ నాలింపఁగలిగె. అజ్ఞామిషఁ జేకాదశీవ్రతము సలిపెనంటివే యెన్ని సంవత్సరములు తద్వ్రతవిధానము జరుపుచుండెనో? చోరులలోఁ గలసి జాతినీతు లుజ్జగించియున్నవాని కీవ్రత మెట్లు పట్టుపడియె? ఇదియంతయు సోల్లాసముగ విన కుతూహలము నాకుఁ బొడమెడు.

నార—రాజేంద్రా! ఆయురారోగ్యైశ్వర్యములు సర్వము నింకొకసారి విచెద. ఇప్పటికి వేళయైనది నీకు మంగళము కానిమ్ము సెలవుపోయివత్తును

రుక్మా—ఉ॥ ధన్యుఁడనైతి మీకృపకుఁ బాత్రుఁడనైతి సమస్త రాజరా
జన్యులలోన ధర్మగుణశాశ్వతకీర్తుల నెల్లవారికిన్
మాన్యుఁడనైతి మీరు బహుమానముతో నిటు లేగుదెంచ సా
మాన్యులకిట్టి భాగ్యమహిమల్ సమకూరునె మౌనిచంద్రమా.

క. కారణబాంధవులితరులు,
కారణబాంధవ్యరహితమీరు గాన నను శ్రీ
నారాయణభక్తిప్రసక్తి
పారాయణుఁ జేసి కృపాపారీణులారా.

(నమస్కరించును).

నార—ఐశ్వర్యమస్తు (నిష్క్రమించును).

రుక్మా—మంత్రిసత్తములారా! వింటిరే యీనారదమహర్షి యాడిన యేకాదశీ వ్రతమాహాత్మ్యము! భవశోకహరమై, మోక్షదాయకమై వెలయునట్టి వ్రతరాజము, ఇది మఱి, నిర్మలమానసములఁ బాలికతో నిది జరుపలేకయున్నారము నేఁడే దిశకెల్ల, నొక సేవకసమువారియుండు నా రాష్ట్రమునను, నగరగ్రామ జనపదములకెల్లఁ బంపి, యీవార్త నేకాదశీవ్రతము నాచరింపవలయునని చెప్పి చాటింపఁ బంపుఁడు ఈవ్రతాచరణమునకు బ్రతికియుండి పాలుమాలినవారికి శిక్షగలుగునని యెఱుఁగఁ జెప్పుఁడు బలవంతముననైన సన్మార్గాచరణము కలుగఁజేయుట విహితము కావున వైష్ణవరసగ్రహలాభమున నా యాదివిష్ణుపదపంకజముల యొద్ద నుండు సాన్నిధ్యము, కల్గించి యీ తద్వ్రతాచరణము బలవంతముననైన నెలకొల్పవలయును ఎల్లవారకెని, మొదట నొక్కింత కష్టముగా నుండినను, సభ్యాగకశేషమున దీర్ఘము సంతోషమున నవలంబింతురు.

మంత్రి—భాగ్యము. రాజరాజా! ఇప్పుడే యన్ని యూళ్లకును భటన్ని యోగమునఁ బంపెదము.

(నిష్క్రమింతురు.)

———:o:———

## ప్రథమాఙ్కము ద్వితీయరంగము.

——— ० ———

వీధి.

[ప్ర: రాజసేవకుఁడు (బండిపై నగారవాయించుచు నొకభటునితో) కాగితము చేపట్టి.]

సేవక — ఇదిగో! జనులారా! రుక్మాంగద మహారాజుసభకు ననుగ్రహించి విచ్చేసియున్న మహామహులగు నారద ఋషివర్యులు వ్రతములలో నెల్లఁ బ్రతిలేనిదై యేకాదశీవ్రతము రాజిల్లుననియు నాదివిష్ణులోకనిశ్రేణి యనియు మోక్షసౌఖ్యపేటిక యనియు భవవహ్నిపాతబ్రహ్మాస్త్ర మనియుఁ బెక్కువిధముల శ్లాఘించినందున రాజుగారు యోచించి సర్వజనులకు క్షేమమును నాముష్మికసత్ఫలమును నొదవుటకై తా మొక్కరే కాక తమరాష్ట్రమునఁ జేరిన యెల్లజనులు తద్వ్రతసంపూర్ణాచారము పాటింపవలయునని యాజ్ఞయిచ్చియున్నారు ఎల్లవారును చాతుర్భక్తిద్దిముగా నేకాదశీవ్రతము సల్పవలయు దశమినాఁ డభ్యంగనము చేసికొని రాత్రిభోజనము మాని యేకాదశిశుద్ధోపవాసము చేసి రాత్రియంతయు శ్రీహరినిలయమున జాగర మొనర్చి ద్వాదశినాఁడుదయమునకే పారణ మొనర్చి యారాత్రి సకల భోజనమును స్త్రీపురుషసంగమును మాని వ్రతాచరణ మొనర్పవలయునట్లును నిందులకుఁదప్పి వారు శిక్షార్హులగునట్లును, రాజుగారు గట్టికట్టడ మొనర్చియున్నారు మనరాష్ట్రజనులు విధేయులై పరమరాజభక్తిపరులై యున్న కారణమున శిక్షవలని యేభయము లేకయే మనఃపూర్తిగ భక్తిమై తమయాజ్ఞ నెఱవేర్తురని రాజుగారు మిక్కిలి విశ్వసించియున్నను విధిగోరకై యాశిక్షమాట వచింపఁబడియున్నది

సీ. అభ్యంజనస్నానమాచరించి దశమి
    నిలనొక్కపొద్దుండవలయునుండి
హరివాసరమున నిరాహారులై జాగర
    మెలమిమైనిశిఁ జేయవలయునుండి
ద్వాదశి విప్రసంతర్పణం బొనరించి
    య్యెలమిపారణ సేయవలయునుండి
తద్దినం బెల్లనిద్రయు రాత్రియన్నంబు
    వర్జించి యుండఁగావలయునుండి

గీ. అందఱికి నేదేవిధంబు రాజాజ్ఞనుండి
నవ్విధిగ నైహికాముష్మిక ఫలసాధనంబునుండి
తప్పఁగా రాదు తప్పినఁ దప్పు నుండి
ఆదినారాయణునకు ప్రియంబునుండి.

(నగారవాయించుచు నిష్క్రమించును),

(యవనికదిగజారును).

—o

## ప్రథమాంకము-తృతీయరంగము.

——— o ———

సత్రము. (సత్రము కావలివారిరువురుందురు).

[ప్ర: పిచ్ఛిలుఁడు, వలాహకుఁడు.]

పిచ్ఛిల—వలాహకా! ఈరాత్రి కేశవాలయమున గంగావతరణ కథ కాలక్షేపమఁట నీవు వినలేదా? శోభనాచార్యులను భాగవతుఁడు మాళవమునుండి వచ్చియున్నాఁడఁట మిక్కిలి గొప్పవాఁడఁట ?

వలాహ—పిచ్ఛిలా! నేనటు వినలేదే మురభంజనోపాఖ్యానము కాలక్షేపము చేయుదురని వింటినే.

పిచ్ఛిలా—అదియెక్కడ ?

వలాహ—కేశవాలయమునందో లేక పద్మనాథదేవాలయమునయో చక్కఁగాఁ దెలియదు

[ప్ర. పథశ్రాంతియైన పంచాపకేశుఁడను నధికారి-చంటిబిడ్డతో నతనిభార్య కుముదాంబ-జలంధరుఁ డను సేవకుఁడు.]

అందఱు—(సత్రమున నాయాసమున వచ్చి కూరుచుండుదురు).

పిచ్ఛిల—అయ్యా! మీరెవరు ?

పంచా—ఇదిసత్రమేకదా ?

పిచ్ఛిల—ఆహా! ధర్మసత్రమే. మీ రెక్కడనుండి వచ్చినారు? ఎక్కడకుఁ బోవు చున్నారు ?

పంచా — అయ్యా మాది బహుదూరదేశము దక్షిణపు వైపున నుండువారము కాశీ యాత్రకై వచ్చియున్నారము

పిచ్చిల — సంతోషము ఆప్రక్కన రెండుగదులున్నవి అక్కడమీవస్తువు లుంచుకొనుడు

(బిడ్డయేడ్చును)

పంచా — అయ్యా! ఇక్కడ బిడ్డకుం బాలెక్కడనైనం దొరకునా?

పిచ్చిల — అయ్యా! ఈనాండామాటాడకుము

పంచా — అదియేమి! ఈయూరిపాలు దొరకవా?

పిచ్చిల — సృష్టిజలసమృద్ధి గలిగి యనేకగోధనముచే రాజిల్లుచున్న యీరాజ్యమునం బాలకేమి తక్కువ? ఈసత్రముననే బాటసారుల యుపయోగముకొఱకు నిరువది పిదుకుటావులుగలవు

పంచా — అట్లయిన పాలు లేవంటివేల?

పిచ్చిల — పాలు లేవని యెవరుచెప్పిరి? ఈనాండు పాలీంబడవనియంటిని.

పంచా — అదియేమి?

పిచ్చిల — ఈనాండేకాదశియనుట తెలియదా?

పంచా — ఏకాదశియైన?

పిచ్చిల — అట్లడిగెదవేమి? చిన్నబిడ్డలు మొదలుకొని యేకాదశి నిరాహారమే చేయుదురు

పంచా — ఇదియేమి యసాధ్యమే! ప్రణతార్తిహరా! యీవస్తువులన్నియు నాగదిలో నుంచి యీయూరిలోనికింబోయి యెందైన నిన్నిపాలు తీసుకొనిరమ్ము

ప్రణత — చిత్తము (అని పిచ్చిలునితో) అయ్యా! వీరు మధురలో న్యాయాధికారి. పాపకేశశాస్త్రియని పేరు గొప్పయింటితనము, భార్యతో బిడ్డతో వచ్చియున్నారు నెలకు రెండువేల రూప్యములు వేతనము ఎక్కడనైన నిన్నిపాలు తెప్పించి యిమ్ము రొక్కము కావలసియున్న నిచ్చెదను

పిచ్చి — నీకేమి పిచ్చిపట్టెను సర్వజనులు నేకాదశి చేయవలయునని రాజాజ్ఞయై యున్నది రాజునాజ్ఞ యట్లుండంగా దైవమునాజ్ఞయు మాకట్టిదియేయగు. నీవు రొక్కమిచ్చినను నేమిచ్చినను పాలేకాదు వంటకుం బదార్థములైనను నేండు చిక్కవు

(బాలుండేడ్చును)

పంచా — ఏడవకు నాయనా! యేడువకు సప్తఋషీ! సప్తఋషీ (అనియూఱార్చును) (పిచ్చిలునితో) ఇదియేమన్యాయమయ్యా! యీయూరిలో బిడ్డకుం బాలివ్వరన్న బిడ్డలు చచ్చిపోవరా?

పిచ్చిల — అయ్యో! శాస్త్రిగారూ! ఇంతేనా మీ ధర్మశ్రవణము. ఒకనాంటి కూడు లేమికే మృతిజెందంగలరా! మృతిజెందినను యేకాదశీమరణము. అదిలభించుట కెంత పుణ్యముండవలయును.

పంచా—ఛీ! యేమిమాటాడెదవు ఆమాటనకుము ప్రణతార్తిహరా! లెమ్ము పోయి రమ్ము కావలసిన పదార్థములన్నియుఁ దీసుకొనిరమ్ము వంటచేసికొందము

పిచ్చిల—నీకుచెప్పువాఁడేమి బుద్ధిలేనివాఁడా? ఒక్కపదార్థమును నీయూరిలో నీనాఁడు దొరకదు కొంచెము నాలుగుగడియలు ప్రాణము బిగఁబట్టుకొనుఁడు. తెల్లవాఱియు వాఱకముందే యమూల్యభక్ష్యములతో వంట కాఁగలదు మీరువల దన్నను విడువక పిలుచుకొనిపోయి యారగింపఁ బెట్టెదను ఒక్కనాఁటికే ప్రాణము పోవునా?

పంచా—అయ్యా! ఈయుపదేశము నిశ్చయముగ నమ్మలేము. పోవరా! ప్రణతార్తిహరా! (ప్రణతార్తిహరుఁడు నిష్క్ర)

పంచా—అయ్యా! ఆమూల వంటచేసుకొనవచ్చునా?

పిచ్చిల—నీగుడులలోనే వంటశాలగలదు. పండుకొనుఁడు రాత్రి కేశవాలయమున నద్భుతరీతిగా హరికథ జరుగఁగలదు మహానందమున జాగరమొనర్పవచ్చును. తెల్లవాఱకముందే మీరు వంటచేసుకొన నెంచిన సర్వపదార్థముల నిచ్చెదము. సంతర్పణకువచ్చితిరా యింకను సేమిలే?

పంచా—అయ్యా! ఇంకఁజాలును మాకు మీయేకాదశియేవలదు మీపదార్థములును వలదు మీపుణ్యమును వలదు మీయుపచారమును వలదు.

పిచ్చిల—అయిన మీయిష్టము.

[పునః ప్రవేశము ప్రణతార్తిహరుఁడు]

ప్రణ—అయ్యా! ఇదిపాడుగ్రామము. అంగళ్లలోఁ గావలసిన పదార్థములున్నవి. ఈనాఁడే కావలెనని క్రయమున కీయరు గొల్లవాండ్రు పాలు కుండలకు వంచియున్నారు. రొక్కమునకైన, నూపకామునకైన చేపు తెల్లవాఱుటవఱకు నివ్వరు. వీరలనేమి పుణ్యాత్ములనవలయునో, పాపాత్ములనవలయునో, తెలియదు

పంచా—అయ్యా! మీయూరివాఁడఱు బహుపుణ్యాత్ములుగా నున్నట్టున్నారే? మీరాజెవఁడు?

పిచ్చిల—మాయూరు విదిశారాజ్యమునకుఁ జేరియున్నది అధిక ధర్మాత్ముఁడై సముదంచిత దైవభక్తిపరుఁడై యలఘులీల నేకాదశివ్రతము పాలింపుచు మమ్మెల్లరఁ గృతార్థుఁ జేయుచున్న రుక్మాంగదుఁడు మాకధిపుఁడు.

పంచా—(స్వ) సరియే ప్రమంచియధిపుఁడే! (ప్ర) ప్రణతార్తిహరా! అక్కడే సరస్సున్నట్టున్నది పోయి స్నానమొనర్చి యాకడవతో నీరుగొనిరమ్ము

(ప్రణతార్తిహరుఁడు నిష్క్రమించును).

శమసా! యీబాలుని నెత్తికొనిపోయి యాడింపుము మనయొద్దయున్న పాలపొడినైన నింతకాఁచి పాలుగానొనర్పుము.

[పునః ప్రవేశము ప్రణతార్తిహారుఁడు.]

ప్రణ—ఏమన్యాయముకొంప! ఆసరస్సునొద్ద నొకకావలివాఁడున్నాఁడు. కడవ ముంచి తేనీయఁడు కావలసినన్ని నీళ్లు తీసుకొని గట్టున స్నానము మాత్రము చేసి విని యోగము చేసి పోవలయుఁగాని కడవలో నీరుముంచుకొని పోనివ్వనని నిర్బంధ పెట్టుచున్నాఁడు

పంచా—(పిచ్ఛిలునితో) ఇదేమన్యాయమయ్యా! మీయూరిలో నీరు తీసుకొననివ్వరఁట?

పిచ్ఛిల—ఎన్నిమాఱులు చెప్పవలయునయ్యా! ఒక్కటే కథగదా? ఏకాదశినాఁడు పగటివేళ నీకు నీరెందులకయ్యా? తెల్లవాఱఁ జేయవలసినవంటకు రాత్రిజాము పొద్దుమీఱిన పిదపఁ గావలసిన నన్ని నీళ్లు తెచ్చుకొనవచ్చును అభ్యంతరముండదు. కావలసియున్న నాచమనమునకని చిన్న పంచపాత్రతో నీరు తెచ్చుకొనవచ్చును

పంచా—ఆచిన్న పంచపాత్రనైన నీరుతేరా! ప్రణతార్తిహరా! కొంచెము కాఁచుకొందము

పిచ్ఛిల—ఎట్లు కాఁచుకొందురు?

పంచా—ఏల? కాఁచుకొనుటకుఁ గట్టెలైనఁ జిక్కవా?

పిచ్ఛిల—ఈనాఁ డర్ధరాత్రియైన పిదప నే యంగళ్లలోఁ గట్టెలైనఁ జిక్కుటం.

పంచా—ఏమయ్యా! యీసత్రములో కొండవేసిన్నాళ్లు వేసియున్నారే వంటచెఱకులు. అవి రెండివ్వరాదా?

పిచ్ఛిల—అర్ధరాత్రము మీఱుటవఱకు వాని నిచ్చుటకు మాకాజ్ఞలేదు

కుముద—నాథా! బాలుని యేమ్ప నిలుపుటకు సాధ్యమేలేదు ఈపాడుకొంపలో నేల? ఎంతశ్రమమైనఁగాని బండిగట్టుకొని ముందూరికైనను బోవుదము

పిచ్ఛిల—కావచ్చును అయిన నీనిర్బంధములు తప్పవలయునన్నఁ దూర్పు ముప్పదియామడలు, పశ్చిమమున ముప్పదియామడలు, ఉత్తరమున నిరువదియైదామడలు మాత్రము పోవలసియుండును అంతవఱకు విదిశానాథుని రాజ్యమే.

పంచా—హా! దైవమా! దేవీ! ఇంకేమి చేయవలయు బలవన్మృత్యుస్నానము లని వినియెఱుఁగుదుముగదా? అట్లనే యిదియు బలవంతపు టేకాదశీ వ్రతమనుకొందము.

(లోపల భేరీధ్వని)-

పిచ్ఛిల—అయ్యా! తప్పదు లెండు స్నానభేరి మోగుచున్నది ఏటికిఁబోయి స్నానముచేసి వత్తము. (నిష్క్రమింతురు).

—: ప్రథమాఙ్కము సమాప్తము. :—

శ్రీ

# మోహినీ రుక్మాంగద నాటకము.

—— () ——

## ద్వితీయాంకము-ప్రథమరంగము.

—— () ——

### సంయమపురి.

ప్ర: యముఁడు వైద్యనాథుడనుగంధర్వుఁడును. (చదరంగమాడుచు)

వైద్య—ఓడితినింకఁజాలును ధర్మరాజా! ఇప్పుడిప్పుడుకదా కొన్ని సంవత్సరముల నుండి నీ కవకాశముదొరకుట ఇంతకుఁ బూర్వమీయాటలకై యెక్కుడంతైన నీకుఁ గలుగుండదే? ఇట్లుండియు నింత స్వల్పకాలమున నెట్టిశక్తి యార్జించితివి!

యమ—వైద్యనాథా! ఇంగులకింత ప్రశంసవలయునా! నీ పాండిత్యము నెదుట నా ప్రతిభయెంత? చూచితివా! ఇన్నిదినములు నాకుఁ బొద్దుచాలదేయని యేకఱు చుంటి ఇప్పుడు పొద్దుపోవదేయని వేసరుచున్నాను.

వైద్య—ఏమి! ఒక్కరైన నీకుటికి రా రా యిప్పుడు?

యమ—ఎప్పుడో యొకప్పుడు వచ్చుచుందురు గాని, నా కవకాశముగలుగుటయే మెండు.

వైద్య—అయిన నాకింక సెలవా? మఱల నెప్పుడు రావలయు

యమ—పొద్దంతయు నీ విందేయున్న సంతసింతును.

వైద్య—ధర్మరాజా! అవశ్య మాడవచ్చును కాని, నాకించుక పనియుండుటంజేసి వీథిలేకయున్నది

యమ—చాలదినములయ్యె నీమిత్రుఁడగు చిత్రకేతుని పాటవినక అతని నింత పంపఁ గలవా?

వైద్య—చెప్పఁగలను కాని వచ్చునను నమ్మకము మాత్రము నాకుఁ గలుగదు. దినమును, రుక్మాంగదు నేకాదశీ ప్రభావమున, భూమిని నిలిచిన ప్రాణులు వైకుంఠలోకమున కరుగునప్పుడు గంధర్వులు-కిన్నరులు-కింపురుషులు పాటము, నప్సర స్త్రీలాడుచు, దేవదుందుభి ధ్వాన మొనర్పవలయునని తప్పని పద్ధతిగానున్నది. కావున నిందఱు గంధర్వులుండియు నొక్కరికైన రెండు గడియలైన నవకాశ మొదవకున్నది. ఎందైనఁబోయి వేడుకగాఁ గాలము గడపవలయునని కోర్చుండిరా వెంటనే సేవకులు పిలువవత్తురు.

యమ—అట్లనా! ఇంకేమి మహాశ్చర్య ప్రక్రియగానున్నది గాని! దేవేంద్రుం డిప్పుడప్పుడు నడపుచుండిన యప్సరోగణముల నాట్యములకు నన్నుఁ బిలపించుచుండెడి వాఁడు కాలక్షేపమాత్రమునకు గాలకి యొక్కనాఁడైనఁ బోవఁజాల నిప్పుడెంతకాలము గలదు గదా పోవలయునన్న, నాట్యములే లేకుండ నయ్యె ఒక్కమాట నీవెట్లయినఁ జేసి దేవనాథునికిఁ జెప్పి రెండుగడియ లెవ్వరినైన నచ్చరలఁ బంపునఁగలవా? కావలసియున్న లేఖవ్రాసియిత్తును

వైద్య—ఎట్లయిన విశ్వప్రయత్న మొనరించి యెవరినైన గంధర్వుని బంపఁగలను గాని, యప్సరల మాట విడచిపెట్టుము గంధర్వులసంఖ్య మిక్కిలియగుటచే నది యెట్లయిన సాధ్యమగు అచ్చరలన్ననో యల్పసంఖ్యాకులు క్షణక్షణమును వారికిఁ బిలుపుదగిలి యొక్కరికైన నవకాశములేమిచే నెంతయుఁ బరితపించుచున్నారు వారిలోనసే వారొక్కరికొక్కరు మాటలాడవలయునన్న, నాజీవవైకుంఠ ప్రయాణోత్సవకాలమునఁ గాక, వేఱుకాలమున వారి యొకికిపట్టుల నవకాశమే లేదు తమ్ముఁ గనిమేషులుగా నిద్రలేకుండ బ్రహ్మ సృజించినందులకు వారు పడుసంకట మింతయని చెప్పఁజాలను మఱచితి నిన్న బ్రహ్మలోకమునకుఁ బోయెదనని చెప్పియుంటివే? అందలి విశేషము లేమియుఁ జెప్పవైతివి

యమ—నేఁ బోవలయునని వెడలి యొక్కింత దూరముపోవఁగా దేవగురుఁడగు బృహస్పతి దర్శనము నాకులభించె అతనితో ధర్మశాస్త్ర విచారమునకుఁ బూనుకొని సంభాషించుచుండఁ బ్రొద్దుపోయినందున విరించి దర్శనముకాలేదు రేపు మఱల పోవలయునని యున్నాను

వైద్య—శమనా! నిరంతరము జీవవిచారమున నున్న నీకు నిపుడించుకైన పనిలేకుండుట విచారమునకుఁ గారణముగా నున్నదా లేక సంతసమునకుఁ గారణముగానున్నదా?

సీ. అసిపత్రవనములయందుఁ ద్రోయఁగలేదె
విలపింపఁ గన్యకావిక్రయులను
దారుయంత్రములనంతటఁ ద్రిప్పఁగాలేదె
దారుణక్రియ గురుతల్పగులను
కూటశాల్మలులందుఁ గుదియఁగొట్టఁగలేదె
పాడిదప్పినధరాపాలకులను
గాలసూత్రములందు గడియనొంపఁగలేదె
ఘనశక్తి విశ్వాసఘాతకులను

తే. గీ. వహ్నికుండములంబడవైవలేదె
తల్లడంబందఁగా గృహదాహకులను
బెబ్బులులచేతివడిఁగఱపింపలేదె
గరళమన్నములోనిడుకష్టమతుల.

యమ—గంధర్వోత్తమా! నీతో నిదివఱకే చెప్పియుండలేదా? మొదట కొన్ని దినములుమాత్ర మీపనిలేనియునికి మహావిచారమునకుఁ గారణమయ్యె ఎందఱు జీవులనో, యెన్ని నరకములనో, చెప్పరానిబాధల వారి పాపానుగుణముగాఁ బెట్టుచుండిననాకు నేమియుఁబనిలేక యూరక నీఁగెఁదోలు కొనుచుఁ గూర్చుండియుండవలయునన్నఁ బెన్నిధానము పోయినట్లు చింతకుఁ గారణముగానుండె. తర్వాతఁ గొన్ని దినములకు నాకార్యహీనత యనలేని సంతోషమొసగించునట్లయ్యె. నే నదివఱకొనర్చుచుండిన హింసాకార్యముల నేవగించుట కాస్పదమయ్యె అభ్యాసవశమున నేదియు నిట్లేగదా?

వైద్య—సందేహమేమి?

యమ—అదిగాక యిన్నిదినములు బ్రహ్మదర్శనముగాని, దిక్పాలమిత్ర దర్శనముగాని, నాకులభింపవలయునన్నఁ గష్టసాధ్యముగానుండె ఇప్పుడెన్నిమారులు దర్శనము చేసికొనవలయునన్నను నెంతికాలము సంభాషణచేఁ గడపవలయునన్నను, నభ్యంతరములేదు ఇది మిక్కిలి మోదకారిగదా?

అనుబంధము 1.

వైద్య—ఔను.

యమ—కానిమ్ము. పొమ్ము శేషు మఱలఁ గలియుదుము. (నిష్క్ర-9.)

— o —

## ద్వితీయాంకము-ద్వితీయరంగము.

ఇంద్రపురిలో

[ప్ర. రంభ-మేనక-తిలోత్తమ-హారిణి-మోహిని-ఊర్వశి
హేమ-వరూధిని ]

రంభ—ఊర్వశీ! నిన్న సురగురుఁడు రచించి ప్రకటించియున్న గీతమిదివఱకు మేము విన్నదానికంటె మిక్కిలి మనోహరముగా నుండలేదా? అది నేర్చుకొనుటకే మిక్కిలి కష్టముగానున్నదే నాకింకను బట్టువడలేదు. నీవేమైన గ్రహించితివా?

ఊర్వశి—ఏమో యొకవిధముగ గ్రహించియున్నాను గాని యింకను నామార్గము ఋజుమార్గముగా నుండినట్లు కనపడలేదు.

రంభ—ఏదీ! ఎంతొలకంతయు

ఊర్వ—(ప్రయత్నము చేసి) లేదే! ఇంకను గ్రహముగా రాలేదు ఓపటికి నేర్వవచ్చును.

హేమ—అక్కలారా! మన మోహిని యిప్పుడే గుఱుతించినట్టున్నది నేఁడుదయము ననే మనోహరముగఁ బాడుచువచ్చె

రంభ—అట్లనా? అట్లయిన నీ మోహిని సమర్థురాలే ఏదీ మోహినీ! నీకా సురగురు గీతము పట్టువడియున్న నింత విందము

మోహి—నాకు నింకను చక్కఁగఁ బట్టువడలేదు.

హేమ—నేఁడుదయమున నన్నట్టుకానిమ్ము చాలును.

మోహి— అనుబంధము 2.

అందఱు—(కరతాళధ్వనులు చేయుదురు).

ఊర్వ—సెబాసు. మోహినీ! నీవు గాన విద్యావిశారద వయ్యేదవు. ఇన్ని దినముల నుండి విద్యావిశారదలని ఖ్యాతిగన్న మాకెవ్వరికిఁగాని రానిమాదిరి నీ వచిరకాలము ననే గ్రహించితివి. ఏదీ! ఇంకొకసారి పాడుము.

మోహి—(పాడును).

హేమ—ఊర్వశీ! ఇదియే యెంతో యందముగానున్నదిగదా? నిన్న రాత్రిఁ గమఁడు రచియించిన గీతము దీనికంటె శ్లాఘ్యమని నాకుఁ దోఁచుచున్నది.

ఊర్వ—ఏది! వినలేదే.

హేమ—మోహినీ! దానినింత వింతము చెప్పుము

ఊర్వ—నిన్నరాత్రి యతఁడు గచించియు రచింపకమునుండే యీమోహిని గ్రహించెనా? అట్లయిన నికఁ గొన్ని నాళ్లలో రంభనుగాని, మేనకనుగాని, నన్నుగాని, తిలోత్తమనుగాని పాటింపవారే లేకపోవుదురుగదా (అని చిఱునవ్వు నవ్వును)

మోహి—అక్కా! సముద్రములరియుమటఁ గాలువలన్నట్టు సమంచిత ఖ్యాతిసమేతలగు మీయెదుట నేనొక పదార్థమా?

ఊర్వ—మోహినీ! నేను వేడుకకుఁ బ్రశంసాపూర్వకముగ మాటలాడితిఁగాక, యసూయచే నన్నదానను గాను ఏదీ! కచుగీతి మింత వినిపింపుము.

[ప్ర: శీఘ్రగమనమున దేవసేవకుఁడు]

దేవసేవ—రంభాదులారా! మీరందఱిందుఁ జేరియున్నారా? ఇదియేమిన్యాయము. అదె వైకుంఠలోకమునకుఁ బోవు జీవాత్మలు నిలిచియున్నారు వెడలిరండు.

రంబ—ప్రారంభమాయెనా! హరిణీ! నీవుపొమ్ము, ఒక్కింతసేపు.

హరిణి—(స్వ) గానము వినుటకులేదే ఈపాడు జీవాత్మలెక్కడనుండి వచ్చిరి.

దేవసేవక—వెడలివచ్చెదరా—దేవేంద్రునితోఁ జెప్పవలయునా?

హారిణి—అయ్యా! వచ్చితిని కోపగింపవలదు. (దేవసేవకునితో నిష్క్రమించును)

ఊర్వ—ఏదీ! మోహిని. కచుగీతము

మోహి— అనుబంధము 3 (పల్లవిమాత్రము పాడును).

[ప్ర: 2వ సేవకుఁడు]

2వ దేవసేవ—ఇంకలెండు ఇక్కడనేల కూర్చుండితిరి దక్షిణవైపుననుండి జీవాత్మల యుత్సవము వెడలినది వైకుంఠము వఱకు విడిచి రండు లెండు, లెండు.

రంభ—వరూధినీ! నీవుపొమ్ము

వరూ—అక్కలారా! ఎన్నాళ్లకీ యుగ్రహాచారము మనకు

(2వ సేవకునితో నిష్క్రమింతురు).

ఊర్వ—మోహినీ! ఈకచుగీతము బహుమనోహరముగానున్నది, ముగింపుము.

మోహి— అనుబంధము 3 (ఒక చరణముపాడును.)

[పునః ప్రవేశము 3వ సేవకుఁడు.]

3వ సేవ—లెండు పడమట వైపువారు వచ్చుచున్నారు ఇక్కడఁ గూర్చుండిన జరుగదు;

హేమ—నేను పోయివచ్చెదను. (దేవసేవకునితో నిష్క్రమించును)

మోహి—ఇంకి మనము వెడలవలయు

రంభ—దినదినము నిదేగోడయ్యానే మనకు ఇదివఱకప్సరసలన్న వారినాట్యముతో నెన్నఁడో యొకనాఁడు పనిపడుట ఇప్పుడు తెల్లవాఱినది మొదలు విరామము లేకుండ పనియున్నదే? ఎన్ని దినము లిట్లుండఁగలుగు

ఊర్వ—ఈ యేకాదశీవ్రతము లోకమున జరిగినన్నాళ్లు నిదేగతియే యుండఁగలదు

తిలో—నాకుఁజూడ రుక్మాంగదుఁడు చచ్చు-అకు మనకీ గ్రహచారముండవచ్చ నని యే తోఁచుచున్నది అతని జీవము వైకుంఠమునకుఁ జేర్చినపిదప మనయప్సరల నాట్యముతో నంతపనియుండదు.

రంభ—ఇదేటిమాట' రుక్మాంగదుడు పోయినంతనే యతఁడిన్ని దినములు బహుప్రయాసమున స్థాపించిన యేకాదశీవ్రత మెట్లుడఁగు ఇంక మనకు కొనవఱకునింతే.

[ప్ర 4వ దేవసేవకుఁడు]

4వ దేవసే—వెడలిరండు. ఉత్తరమువైపు వారువచ్చుచున్నారు

రంభ—ఆహా! యేమివిధి

మోహిని—నేఁబోయెద

మేనక—మోహినీ! వలగు. ఆగీతము ముగించి పోవుదము.

తిలో—ఔను మోహినీ! పాడుము

4వ దేవసేవ—మంచిమాటాయె మీపాటలు-మీ కేగుకలు-మీ నోవసులు మీరు లేకున్న నక్కడ పనులెట్లు జరుగవలయు అందఱు నిరీక్షించుచున్నారే?

తిలో—పడియుండని యొకగడియని

4వ దేవసేవ—ఆగడియలో ఇంకెందఱో మీ—రాఁగలరో లెండు లెండు.

తిలో—రంభాదులారా! ఆగీతము నేను పిదప వినఁగలను నేఁబోయెద మిమువిముఁడు

[ప్ర. 2వ సేవకుఁడు]

2వ దేవసేవ—ఏమిరా! ఇక్కడవచ్చి వీరితో సరసములాడుచున్నావే అక్కడ నుత్తరవైపున గంధర్వాదులెల్ల నిరీక్షించి—

4వ దేవసేవ—అదియే వీరితోఁ జెప్పుచున్నాను వీరలు తెలివిలేక పాటలు పాడుకొనుచున్నారు తిలోత్తమా! రమ్ము.

(తిలోత్తమ 2వ దేవసేవకునితో నిష్క్రమించుచు)

రంభ—ఇంకనొక క్షణములో మనమంతు రాఁగలదు మోహినీ! కానిమ్ము.

మోహిని— అనిబంధము 3 పాడును.

4వ దేవసేవ—బళీ! బళీ! (అని మెచ్చుచు).

(మోహిని పాట ముగించియు ముగింపకమునుపే)

[పునః ప్ర: శీఘ్రమున 5వ దేవసేవకుఁడు]

5వ దేవసేవ—(నాల్గవ దేవసేవకునితో) ఓహో! వారిపాటలువిని తలయూచి మెచ్చుకొనుటకా నీవిందు వచ్చినది? అప్సరలారా! లేచిరండు మీరింతాలస్యము చేసితిరి. అక్కడ జీవాత్మల సమ్మర్దము గలిగియున్నది ఉన్న దేవవిమానము లన్నియుఁ జాలకయున్నవి

ఊర్వ—విమానములు చాలకపోయిన మేము మోసికొని రావలయునా?

4వ దేవసేవ—మోసుకొని రావలసివచ్చిన రానేవలయు

రంభ—ఇదేమిబాధ మనకు యెండ్లకొలఁది జరుగఁబోవచ్చునే? ఊర్వశీ! ఇందులకేమి చేయవలయు

4వ దేవసేవ—వైకుంఠమునకుఁ బోవు జీవుల మహోత్సవమునకు నప్సరోనాట్యముండవలయునని విధించిన బ్రహ్మతో మొఱఁబెట్టుకొనుఁడు ఎవ్వరినడిగిన నేమిప్రయోజనము?

మేనక—రంభా! ఊర్వశీ! ఈ దేవసేవకుఁ డేదో యుదాటున నాడినమాట మన కుపదేశప్రాయముగానే యున్నది. మనమందరము గుమిగూడి తేఁపు బ్రహ్మ యొద్దకే పోవుదము. ఈ బాధలఁ దప్పింపుమని యా హిరణ్యగర్భుని వేఁడికొందము.

5వ దేవసేవ—మీరు మాటలతోనే జాగుసేయుదురే? అడిగో చూడుఁడు మఱియొక సేవకుఁ డావైపునుండి పరుగెత్తి వచ్చుచున్నాఁడు మిమ్ములను బిలుచుటకు. లెండు. లెండు

అందఱు రభసమున నిష్క్రమింతురు.

## ద్వితీయాఙ్కము-తృతీయరంగము.

———0———

### బ్రహ్మసభ.

[ప్ర: బ్రహ్మ-సరస్వతి-ఋషులు-సనకుఁడు-సనందుఁడు-యముఁడు-నారదుఁడు.]

ఆనుబంధము ౬.

బ్రహ్మ—ధర్మరాజా! మఱేమి వచ్చియుంటివి? నావలనఁ గాఁదగిన కార్యమేమైన నున్నదియా?

యమ—ధాతా! నిను దర్శించుకొనుటకంటె నాకుఁగార్యమేమి? విరామములేక పగలును రాత్రియు జీవవిచారమువలన నున్నకాలమున నిన్ను దర్శింపవలయునన్నఁ దీఱిక యెుదవుటయే దుర్లభముగానుండె ఇప్పుడన్నెనా యెడలేని విరామము నాకు లభించియుండుట మున్నె నే విన్నవించితిఁగదా?

చ. ఒదవినకార్యభారమున నుజ్వలజీవవిచార మెప్పుడుఁ
వదలకచేసి బాధ లనివార్యముగా నిడుచున్నవానికిఁ
ఇదెయువకాశమిప్పుడురహించె భవాదృశులైనవారిన
త్పదములగొల్వవచ్చుటకు భాగ్యముగాదెసరోజసంభవా.

నినుబోలు గొప్పవారి సందర్శనమునకుఁ బుణ్య సంపాదనమునకు నాకిప్పుడింత యవకాశము కలిగియున్నది.

బ్రహ్మ—సంతోషము ధర్మరాజా! నీకిప్పుడు పనియేలేకున్నదిగదా?

యమ—బొత్తిగా లేకున్నదని చెప్పుటకులేదు ఇన్నాళ్లుండిన పనిలో శతాంశమైనలేదు

బ్రహ్మ—ఇదియంతయు రుక్మాంగదు హరివాసర వ్రతాచరణ మహాత్మ్యమేగదా?

యమ—అన్నిటికిని నీవేకదా కర్తవు? నీవువారియక వ్రతాచరణమున జీవులకెల్ల వైకుంఠగమనము లభించియుండునా?

బ్రహ్మ—వినలేమన్నా! ఈ కార్యలోపమువలన నీకేమైన మనసునకుఁ గొదవగానున్నదా?

యమ—అయ్యో! కమలాసనా! అట్లెన్నటికైన నుండునా? కార్యమువలన వేసట గొనక చేయుచునే యుంటి. కార్యము లేకున్న మఱియు మేలయ్యె. భగవత్కైంక

కర్మమునకుఁ దన్నామ స్మరణకు నిన్బోలు విజ్ఞుల సందర్శించుకొనుటకు నపూర్వ రీతిగా నాకు విరామ మొదవినందులకు మనసున సంతోషము వొడముఁగాక కొదవ జనించుటకుఁ గారణమేమి?

సీ. సతతంబుసంగీత సాహిత్యవిద్యల
గారవించుటకవకాశమబ్బె
నతిశయంబుగ మిత్రతతులతోడ వినోద
గోష్ఠి సేయుటకనుకూలమయ్యె
నెమ్మదిఁగడుభక్తి నిండాగమినుఁబోటి
పెద్దలదర్శింప వేళఁగలిగె
నం దాఁపరీతిగా హరినామకీర్తనల్
తమిదీఱ సేయంగ సమయమొదవె

తే. గీ. నరసిచూడంగ రుక్మాంగదావనీశు
నలరితైకాదశీవ్రతసత్ఫలంబు
నాకు మోదంబునకుఁగారణంబుగాక
వారిజాసన కొదవకుఁగారణంబె.

బ్రహ్మ—మిక్కిలి సంతసించితిని

యమ—నేనొకటి విన్నవింతెద నీమనసునకుఁ గొదవగలిగెనాయని [illegible]న్నడిగితివే యందునకుఁ గారణము మేమియని యడుగవచ్చునా?

బ్రహ్మ—మఱేమియు లేదు జీవనివాసము లేక నరకములన్నియుఁ బాడుపడియుండినది చూచి నీకు సంతాపము కలిగినదని నేవినుటచే నామాట యడిగితి.

యమ—ఎట్టివారికైన జీవహింస చేయుటకు లేకపోయెనే-నరకములవారి బాధించుటకు లేకపోయెనే యని సంతాపము వొడముట కాస్పదమగునా? ఈ మాట నీకెవ్వరు చెప్పిరి?

బ్రహ్మ—ఎవరో ప్రస్తావవశమున వచించిరి

నారద—కృతాంతా! నేనే చెప్పితిని. కొన్ని నాళ్లకుముందు నేను నీలోకమునకు వచ్చి వినోద సంభాషణము జరుపుకాలమున నేకాదశీ వ్రత ప్రశంసము ముచ్చటించుచు జీవులు పాపమొనరించినను దత్ప్రభావమున నా లోకమునకు రాకున్నారే యని విచారము జనించెనని నీ వనియుండలేదా? అదియే వచించితి.

యమ—ఆమాటయా? నేనన్న వృత్తాంతమేమి నీవుచెప్పిన వృత్తాంతమేమి! చతురా
నన! నేనన్నమాట యిది జీవులు పాపమొనరించినను, నా పాపమునకుఁ దగిన
శాంతివడయక యేకాదశీ వ్రత ప్రభావమున నాపాపముమాటి పుణ్యముగలిగి వైకుంఠ
మునకుఁ బోవుచుండుట శోచనీయ విషయమనియు, దురాత్ములగువారికి నా వ్రతమును
మాత్రము నమ్మి యితరవిషయములఁ బాపమొనరించినను బాధకము లేదనియు
నెక్కడ తోఁచునోయని భీతికాస్పదముగా నున్నదనియు నేనాడితి గాని నరుసం
ధించి నీపుత్రుఁడగు నీ నారదుఁడు జీవవిచారము చేయమికి నేనేమో దుఃఖించుచున్నట్లు,
వచించియున్నాఁడు అతని స్వభావమేకదా?

నారద—నాస్వభావమేమియుకాదు నీదురాపమే? నీమనమున నేమనుకొంటివో
కాని వెలికిమాత్రము జీవులకు నరకబాధలు పోవఁగుటకు లేదయ్యె నేయని నీవు
దుఃఖించినట్టె నాకుఁదోఁచెను ఉన్నమాటయే చెప్పితిని.

[ప్ర. ఒక ఋషి.]

ఋషి—కమలాసనా! విష్ణులోకమునుండి సేనానియగు విష్వక్సేనుఁడు వచ్చియు
న్నాఁడు.

బ్రహ్మ—(లేచి) మనమందఱము పోయి పిలుచుకొని వత్తము (ఋషులతోఁ బోయి,
విష్వక్సేనునిఁ బిలుచుకొనివచ్చి పీఠముపైఁ గూర్చుండఁబెట్టును).

విష్వ—ధాతా! మీకెల్లరకుఁ గుశలమా?

బ్రహ్మ—సేనానాయకా! అందఱికిని కుశలమే నీవిందు విచ్చేయుటచే యా మహావిష్ణు
వేయనుగ్రహించినట్టులయ్యె ఏదో ఘనకార్యముండవలయుఁ గాక లేకున్న మహా
మహుఁడవగు నీవు వచ్చియుందువా? ఆనతిచ్చిన నదెట్టికార్యమైనను శిరసావహించి
చేసెద.

విష్వ—కమలాసనా! ఘనకార్యమేమియు లేదు. ఒకానొక పనికై నీతో నాలో
చించి రమ్మని కమలానాథుఁడంపియుండ వచ్చియున్నాఁడను రుక్మాంగదు నేకాదశీ
వ్రత మాహాత్మ్యమున జీవులెల్ల వైకుంఠమునకే వచ్చుచుండుట నీ వెఱుఁగుదువుగదా?
ఆ వైకుంఠము వైశాల్యమున లెక్కింప నలవిగాని విరివిగలిగియుండియు నిండుచు,
వచ్చియున్నది. మిద్దెలు మేడలెల్లఁ గిక్కిఱిసియున్నవి. ఇంకఁ గొన్నినాళ్లు మాత్ర
మీరీతిగనే జీవాత్మాగమనము జరుగుచుండెనా? చోటులేకుండెడు. కావున
ముందుపనికి ముందే తగిన ప్రయత్నమును జేసి యాపట్టణము నింకింత పెంచుటయో,
లేదా మఱియొక వైకుంఠమును గల్పించుటయో యీవిషయమున నిన్నడుగవచ్చితి.

బ్రహ్మ—సాత్రవతీనాథా! సంకల్పమాత్రమున మాదృశులఁ గోట్లకొలఁది సృజింపఁగల,
యా వైకుంఠనాథునకు నిదియొక్క యోచనయా? నన్నింత పెద్దచేయు తలం
పుతనికిఁ గలిగెఁగాక.

## అనుబంధము 6.

షండులకు మోచన యొకించుకైన నేచెప్పఁగలవాని ఆమహామహుఁడెట్లొనర్చుమని యాజ్ఞయిడిన నట్లొనర్చుటకు సిద్ధముగా నున్నాఁడను.

విష్ణు—ధాతా! అందునకుఁగాదు ఆమహాత్మునకు నెంత సామర్థ్య ముండినను సృష్టిక్రమమంతయు నీవలనే జరుగవలయునుగదా? కావున నీతో నాలోచించుటకు నన్నంపియున్నాఁడు విశ్వకర్మ యెన్నియో గృహములు సౌధములు నావైకుంఠమునఁ గట్టియున్నాఁడు ఎన్నికట్టినను జాలకున్నది. ఇప్పటికేమో చాలినంత ప్రదేశమున్నది నిక్కువమే? ఇంకఁ గొన్ని యేండ్లు మాత్రముపోయినఁ జోటుచిక్కదు. నూతనగృహనిర్మాణమునకు నెడముచాలదు

బ్రహ్మ—క్షేత్రధరా! ఆయ్యాదివిష్ణు వేమొనరింప నాజ్ఞయిడిన నాకార్యమొనర్చుటకు సిద్ధముగానున్నాను

విష్ణు—ఇప్పటికిమాత్రము విశ్వకర్మవంటివాని మఱియొకని సృజింపుమనియు నీకఁ గొన్ని యేండ్లకే వైకుంఠాంతిక నిర్మాణ మవశ్యముగా నుండుననియు, శ్రీధరుఁడు వచింపు మనినాఁడు

బ్రహ్మ—భాగ్యము మదినుంచుకొనెద

యమ—అబ్జగర్భా! ఇది చిత్రముగదా! నాలోకమెల్ల నివసించువారులేక పాడు పడుటకుఁ గారణమయ్యె అంతో మఱియొక్క లోకము నిర్మింపవలసివచ్చె

[ప్రవేశము ఋషి ]

విధాతా! దేవలోకమునను న్న యప్సర స్త్రీలందఱు వచ్చియున్నారు

బ్రహ్మ—మిక్కిలి మేలచెప్పె. మంచిసమయము. రాక రాక శ్రీధరప్రతినిధియగు నీ సేనాని వచ్చియున్నాఁడు. యముఁడును గార్యాంతరములేక యాసీనుఁడై యున్నాఁడు. తమ్మనుము వారి నాట్యమో గానమో జరిపింతుము.

(ఋషి నిష్క్రమించును)

[ప్ర: రంభ-ఊర్వశి-మేనక-తిలోత్తమ- మొదలగువారు బ్రహ్మకు నమస్కరించి ]

## అనుబంధము 7.

బ్రహ్మ—అచ్చరలారా! రండు. మీరలొకరొకరు వచ్చుటకే కష్టముగనుండునే. ఉన్న యచ్చరలెల్ల నొక్కసారియే వచ్చియుండుట వింతయగుఁగదా ?

మేనక—దేవా! ఒకవిన్నపమొనర్ప వచ్చియున్నారము. అనతిచ్చిన విన్నవింతుము.

బ్రహ్మ—ఏమది ?

మేనక — స్వామీ! భూలోకమునుండి వైకుంఠమునకుఁ బారులుగట్టి పోవు జీవాత్మల వెంట నప్సరలో నాట్యముండవలయునని నీవే విధించితివో యింకెవ్వరు విధించిరో తెలియదు కాని నావిధమును మేమిప్పుడు కంటగించుచున్నాము పగలును రాత్రియు విరామము లేక మాకెల్ల నాట్యకార్యమే యేర్పడినది మేము మితసంఖ్యవారమే కాగా యుండుటచే ఆసంఖ్య యెంతమాత్రమును జాలకయున్నది కావున మావిన్నపమిదియే వారివెంట నృత్యమునకుఁ బోవుటకు మాయవశ్యకత తప్పించితివా బ్రతుకు గొందుము ఒండేని యింకను నెక్కువ సంఖ్య యప్సరలనైనను సృజించి పుణ్యముఁ గట్టుకొనుము. ఈ రెండింటిలో నొక్కటి యొనర్పకుంటివా మాకు బ్రతుకులేదు మేము నిర్జరులమే యమరలమే నిక్కము ఐన నింత యలవిలేని వ్యాయామము మాకుఁ గలిగియున్న మా నిర్జరత్వమును, మా యమరత్వమును, మాకు లేకుండిన మేలని యనిపించుచున్నవి. అనుగ్రహించి మము రక్షింపుము

బ్రహ్మ — అప్సరలారా! కూర్చుండుఁడు

రంభ — అయ్యా! విధాతా! మేమెక్కడ కూర్చుండఁగలము

## అనుబంధము 8

ఈ యింతసేపటికే మేము లేనందున శ్రీవైకుంఠ నగరోత్సవమున కల్లోలకల్లోలమై యుండును ఎందఱు దేవసేవకులో మాకొఱకు వెదకుచుందురు మేము నిదిరాప్పగసుల వేఁడికొని కొంతకాలము మాత్రము వసకాశము వడసి వచ్చితిమి మాకేమి యాజ్ఞ నొసంగెదవు

బ్రహ్మ — వనితామణులారా! మీకు మిక్కిలి శ్రమగలుగుట నే నొప్పుకొందును. ఐన నిందున నాయత్నమేమియు లేకయున్నది వైకుంఠమునకుఁ బోవువారికి మీ నాట్యము తప్పక యుండవలయుననుట నే రచించిన విధానము కాదు. ఆదినుండి వేదములతోఁ గూడ నుద్భవించిన విధానముగానున్నది అది మార్చుటకు నెప్పటికిని సాధ్యము కాదు.

## అనుబంధము 9.

ఇంక నూతనాప్సరో నిర్మాణమునకా! అది నాకు సాధ్యమా? మీ జననమన్న నెట్టి యసాధ్య కార్యమువలన లభించినది. దేవాసురుల యుద్ధ నెపంబున నెల్ల దేవతలు నెల్ల రాక్షసులుఁ జేరి యేకమై మంధరమును పెఱికి తెచ్చి విశ్వప్రయత్న మొనరించుచు శ్రీహరికిఁ గూర్మావతారము కలుగునట్టుచేసి యసాధ్య ప్రక్రియగా క్షీరసాగర మథనముఁ గావించి యింత ప్రయత్న మొనరించినఁగదా మీ జననము గలిగె? ఇప్పుడింకెట్లు చేయవలయు. ఈ రెండును నాచేతఁగాని పనులే.

ఊర్వశి—అయిన మాభాగ్య మింతియేకదా ? సంకల్పమాత్రమున జగత్సృష్టి సేయ నేర గలిగి నీవే మా కష్టములకుఁ బ్రతిక్రియ కాపింపఁజాలవన్న మా దురదృష్టవిశేషమే కదా ? ఇంకెవ్వని వేఁడుకొనఁగలము.

బ్రహ్మ—తరుణీమణులారా ? విధి విధానమున నన్నికార్యములు జరుగనే వలయుఁ గదా ? దాని కెవరేమి చేయఁగలరు మీకష్టము నిరంతము నుండఁగలదా ? కాలము నిరీక్షించి యుండుఁడు మీకష్టముల కంత్యము కానేవలయు. ఏవిధానము గాని యెల్లకాలము నొకేరీతిగా నుండదు పోనిండు యాచింపకుఁడు నాపై ననుగ్రహమున నిదే విష్ణుసేనాని యీనాఁడు విచ్చేసియున్నాఁడు శమనుఁడను గారాంతర ప్రసక్తి లేమి ననుఁజూడ నరుదెంచి యున్నాఁడు మీరును యాచింపకయే వచ్చియున్నారు ఏవి మా వీనులకు విందు నాట్యముతోఁగూడ గానము నింత వినిపింపుఁడు.

ఊర్వశి—దేవా ! మాకెల్లరకు నిరంతర గానమున రాసుగొంతును, నిరంతర నాట్యమునఁ జచ్చుకాళ్లును లభించియున్నవి ఐనను మహాత్ముఁడవగు నీ వాజ్ఞయిడిన వలదనఁ జాలుదుమా ? శిరసావహించెదము.

## అనుబంధము 10.

—: ద్వితీయాఙ్కము సంపూర్ణము :—

—:0:—

శ్రీ

# మోహినీ రుక్మాంగద నాటకము.

—:0:—

## తృతీయాంకము-ప్రథమరంగము.

### రుక్మాంగదు నగరు.

[ప్ర: గర్భవతియగు రుక్మాంగదురాణి సంధ్యావళి పడకపై పండియుండ రుక్మాంగదుఁడు ప్రక్కనఁ గూర్చుండియుండును.]

రుక్మాం—ఇప్పటికి నేధన్యుఁడ. ఈతన్వి యింత నిద్రించియున్నది. ఏమపాయము కలుగునోయని భీతిల్లియుంటిని ఆపద్బాంధవుఁడగు వాసుదేవుని నమ్మి తదనుగ్రహామే యెల్లవేళలఁ గోరు భక్తులకు నేకీడుఁగలుగునే? అదిగో మెదలుచున్నది.

సంధ్యా—(మెల్లఁగలేచి కూర్చుండి) నాథా! ఎంతసేపైనది నీవువచ్చి?

రుక్మాం—దేవీ! కొంతసేపైనది ఇప్పుఁడు కొంచము లఘువుగా నున్నదియా?

సంధ్యా—ఇప్పుడేమియు నస్వస్థ్యిలేదు ఈ నిద్రవలన బాధయంతయుఁ దీసిపోయి నట్టున్నది

రుక్మాం—తరుణీ! భగవద్భక్తులమగు మనకు నెన్నటికిని జేటుగలుగదు నేను మిక్కిలి బెగడుపడియుంటి, పూర్ణగర్భభారము ధరించియున్న నీ వవశ్య కరణీయమగు చతుష్షష్టి వర్షికాదశీ వ్రతము నాచరించియుండుటచే నించుక యాయాసమునకుఁ గారణమయ్యె. వైద్యుని ప్రభావమున మొన్నటినుండి క్రమక్రమముగా నీకారోగ్య స్థితికస్సుఖమయ్యె. నేఁడు నిద్రయువచ్చె ఇంకేమియు భీతియులేదు తరుణీ! మొన్న నీవు మాటలాడిన మాటలు తలఁచుకొన్న నిప్పటికిని నాకన్నులకు నీరు వచ్చుచున్నది.

సంధ్యా—నాథా! నేను బ్రతుకుదునని నిక్కముగా నమ్మియుండలేదుకదా? కావున నాతీరున మాటలాడితి.

రుక్మాం—రమణీ! సంతానములేక యన్నిదేవతలఁ గొలిచి తత్ప్రార్థన ఫలముగ నీవాపన్నసత్వవై యుండినందున నీడులేని సంతోషము వహించి నాకెన్నఁడు కుమారుఁడు కలుగునని మితిమీఱిన కాంక్ష నెదురు చూచుచున్న నాకు నీయాయాసముగాంచిన

లోకమే మునిఁగినట్లుండెడి ఇప్పుడింత దైవానుగ్రహము గలిగినందున నూఱటకుఁ గారణమయ్యె మనోహారిణీ! వింధ్యాద్రిలోనున్న మనయిలువేల్పగు చంద్రమౌళీశ్వరునకు నయుత కుంభాభిషేక మొనర్చెదనని మ్రొక్కుకొంటిని. ఆమహాత్ముని ప్రభావమువలననే నీకుని రామయుత కలుఁగఁగలుగు ఎక్కువగ మాటలాడిన నీకాయాసమగును నేనుపోయివత్తును మనకింత సమ్మదము గల్గించిన యీశ్వరు నుపాసింతము,

సీ. కదలిపాఱని తేరు వదలిపాఱని పేరు
    జరుపఁగామెఱుపఁగా నెఱుఁగరేని
సానవెట్టనియమ్ము మేనఁబుట్టినసొమ్ము
    పట్టఁగాఁబెట్టఁగాఁబుట్టరేని
కంతుగందపుఁబూఁత వింతచందపుమేఁత
    పూయఁగామేయఁగా డాయరేని
మింటఁబుట్టినధార మంటఁగుట్టనిచీర
    తలయందుమొలయందుఁదాల్చరేని

మెఱుపునిల్లు విలాసంబునెఱపునిల్లు
    గలుగ నుతికెక్కరేని నాకరము లెత్తి
మ్రొక్కనటువంటి దేవసమూహములకుఁ
    గ్లేశభవభంగ యేకామేశలింగ.

(నిష్క్రమించును).

---:0---

## తృతీయాఙ్కము-ద్వితీయరంగము.

### అమరావతిలో మేనకయిల్లు.

[ప్ర: రంభ-మేనక-ఊర్వశి-తిలోత్తమ-హారిణి-హేమ-వరూధిని-మోహిని.]

ఊర్వశి—బ్రహ్మపైఁ బెట్టుకొనిన యాశనిల్లుయు నిన్నటితో తీఱెఁగదా? ఇంకేమి చేయుదము.

రంభ—ఏముచేయుటకు నేమియుఁ దోఁచకున్నది. ఆరుక్మాంగదుఁడు చచ్చువఱకు మన బాధ యిట్లె యుండఁగలదని నే నెంచుచున్నాను

ఊర్వశి—చచ్చినపిదపమాత్రి మతఁడు విత్తిన యీ వ్రతబీజము పెరిగి వృక్షముగాక నిలుచునా? ఎప్పటికి మన కిదేగతియని యెంచవలయును.

మేనక—అట్లేలగును. రుక్మాంగదుని యాజ్ఞకు భయపడి జనులు విధిలేక యీ వ్రతాచరణ మొనర్చుచున్నారు గాని, అతనిపిదప నెట్టి యాచరణముండఁజాలదని నే నన్నెద

తిలో—నాకు నట్లె తోఁచుచున్నది నిన్న బ్రహ్మను సందర్శించినపుడు రుక్మాంగదుఁడింకను నెన్ని దినములు మనియుండఁగలఁడో యదియైన విచారింపక పోయితిమి. అదిగో! అప్పుడే జీవయాత్ర మొదలు పెట్టినది. దేవసేవకుఁడు పిలువవచ్చుచున్నాఁడు హారిణీ! నీవుపొమ్ము

(హారిణి-నిష్క్రమించును).

ప్రవేశము: [హరిభజన మొనర్చుచు] నారదుఁడు.

(అందఱు నమస్కరించి పీఠమిత్తురు)

మేనక—నారదా! నీయాగమనము మమ్ము ధన్యులఁగాఁ జేసె. ఎక్కడకుఁ బోవుచు వచ్చితిరి? మాయెడ మీ కెంత యనుగ్రహము!

నారద—అప్సరోమణుల్లారా! విమానారూఢుఁడనై యట్టె పోవుచుంటిని. మీ రెల్ల నీ మేడపైఁ జేరియుండ నాకచ్చెరువు జనించి వచ్చితి.

మేనక—అచ్చెరు వేల?

నారద—మీరొకరొకరొక్కొక్క లోకమును స్వాధీనము నందుంచుకొనుటకు సమర్థులు తపోనాశన మొనరింప వలయునన్న, నా కార్యమున మీ యహంపూర్వికయత్యద్భుతము మీ రొకరితో నొకరు కలియువారుగారు ఇట్లు కలసియుండుటచ్చెరువే గదా?

మేనక—ఆమాటకా! మాకేమియు నొకరియెడ నొకరికి స్పర్ధ లేదు అసూయయు లేదు. నారదఋషీంద్రా! బ్రహ్మసభలో నేము మొఱపెట్టుకొన్న కాలమున, నీవునుంటివే. ఈ రుక్మాంగదుఁడు మాకెక్కడ బాఁపురమాయెనో? అతని యేకాదశీవ్రతము మాకు మార్గణ మంత్రముగానున్నది. బ్రహ్మయు మా బాధలఁ దీర్పఁ దనచేఁగాదని యొప్పఁజెప్పె. ఋషిచంద్రమా! నీవును మాఱట బ్రహ్మయే యగుదువు దీనికేమైనఁ బ్రతిక్రియ దోఁచియున్న దయచేసి చెప్పరాదా?

నారద—వనితామణులారా! మీకు నేనేమి చెప్పఁగలను? నాసంగతియు సమీపమునకు వచ్చునట్లున్నది ఈలోపల విష్ణుదూతలు జీవములనూరేగించుకొని పోవునపుడు గొప్పవారి శివాత్మలకు గంధర్వులు చాలక నన్నును దుంబురుని బిలువ సమకట్టియున్నారు ఎట్లో నీవటుకుఁ దప్పించుకొని యున్నాను

మేనక—అట్లయిన వనితామణులారా! మనరూప ప్రభావమున నా రుక్మాంగదు నిర్జించి యీ యేకాదశీవ్రతము మాన్పింపవలయును ఇదిదప్ప నుపాయాంతరమెు లేదు. నేనే పోయెదను

ఊర్వశి—మేనకా! నీకీటికింత శ్రమ? నేఁబోయెదను

తిలో—విశ్వామిత్రుఁడు మొదలగువారిఁబోలిన గొప్పవారైన మిమువంటివారికి శ్రమయివ్వవలయునా ఈ రుక్మాంగదునంతవానికి మీ రేలఁ మేమెవ్వరైనఁ బోయెదము

మోహిని—అక్కలారా! నా విన్నపమొక్కటికలదు మీరెల్ల జగత్ప్రసిద్ధిఁ గాంచినవారలు. రూపమున నేమి, ప్రభావమున నేమి, మిమ్ముఁ బ్రశంసింపనివారే కలుగరు. నేనన్ననో పేరుమాత్రము మోహినియని యున్నదిగాక, నా సమ్మోహన ప్రభావమెవ్వరు వినియుండలేదు ఈరుక్మాంగదునకు నేనచాలుదు. నన్నంపుఁడు నేఁబోయి మీకెల్లరకు ఖ్యాతిఁ దెచ్చెద

మేనక—మోహినీ! నీవంతపనిఁ జాలుదువనుటకు సందేహమేమి ఏవీ! నీ చాతుర్యమైనఁ దిలకింతము నీవేమి చేయుదువు? ఎట్టికార్యము సాధింతువు? వచింపుము.

మోహినీ—వచింప వలసినదేమున్నది? నా మోహవాగురలలో రుక్మాంగదుఁ జిక్కించుకొని నే నాడించు నాట్లాడఁజేసి యీ వ్రతము మాన్పఁ బ్రయత్నించెద.

మేనక—చూడు మదికార్యము. ఇంకెక్కువగా నేమి చెప్పవలయును?

రంభ—సఖీ! మోహినీ! ఇదివఱకు దేవేంద్రుఁడు తపస్వులయెడకు మమ్ముఁ బంపుచుండుఁగదా? అతని కార్యముకొఱకు మేము ప్రయత్నించి యతులనెల్ల మాటుమా

గొలిపి దేవేంద్రునిచే మెప్పులు వడయుచుంటిమి ఇప్పటిపనియన్న పట్ల మన స్వంతకార్యము రుక్మాంగదు గెలుంచితిమా మన ప్రేమలెల్లఁ బరిహాసములగు ఎంత నేర్పరిగాఁ గార్యము సాధించెదవో సుమా ?

మోహినీ—అక్కా! అప్సరలలోఁబుట్టి యింత కార్యము సాధింపలేక మీకిందుకే నప కీర్తి తెచ్చెదనా? మీ రేమియు యోచింపకుఁడు ఆ రుక్మాంగదుఁడన్న నెంతవాఁడు వాని ధూపార్తి విటుఁగాఁ జేయఁజాలకున్న నేనొక యప్సరసనా?

నారద—రంభా! ఈ మోహిని తానన్నంతపట్టునుఁ జేయఁగలదియే మిక్కిలి చాక చక్యమునుగలది మోహినీ! ఎట్లయినఁజేసి నీ వీకార్యము సాధింపనేవలయు నివు మాకును నుపకారము చేసినదానవగుదువు

మోహినీ— నారదా! నీ యాశీర్వాదమున్న నాకిది యెంతకార్యము ?

మేనక—అదిగో పలువురు దేవసేవకులప్పుడే పలుమాఱుమ వచ్చుచున్నారు ఈ జీవా త్మల యభ్యాగంటంతయు మాయొద్దఁ బూడిచిపెట్టినట్లు మమ్ము బాధించుచున్నారు ఇంక మేము పోవలసియేయున్నది. మోహినీ! ఇక్కడికార్యములు మే మెట్లైనఁ జూచికొందుము రుక్మాంగు మఱల్పుకార్య భాగమంతయు నీపైనే మోపియు న్నారము లెండు-చెలులారా! పోవుదము

(మోహిని తప్ప నందఱు నిష్క్రమింతురు)

మోహిని— నేనును బ్రఖ్యాతిఁజెందుట కిదిగదా సమయము! మొదట పతినియమారికి వేషాంతరమునఁబోయి యతని వృత్తాంతమంతయు నరసెద

తే గీ. రంభకును మేనకకును నుర్వశికి ధరణి
నెందునైనలేని ప్రఖ్యాతి యొసఁగెఁగాదె
యోర రుక్మాంగదునివ్రతం బడగఁజేసి
మోహిని యటన్నవిఖ్యాతి మొనయుదాన.

క్షిదప నందుల్లక్తుఁదగిన విధాన మాలోచించెద.

(నిష్క్రమించుచున్న)

———o———

## తృతీయాఙ్కము-తృతీయరంగము.

- 0 -

### విష్ణుదేవాలయము.

[ ప్ర : మోహిని (పురుష వేషమున). ]

మోహిని—ఏమి జనులు కలసియున్నారు? పదినేవు రుండవచ్చును. ఈదిన మేకాదశి యగుట జాగరమునకు రుక్మాంగదుఁడే వచ్చునట్లున్నది విష్ణుదేవాలయమునకు కావున నింతి జనసమ్మర్దము కలిగియున్నది ఆహా! రుక్మాంగదుఁ డే మీ వేషమున వచ్చుచున్నాఁడు? జాగరము నాఁడిట్లనేకాఁబోలు. అదియేమి హరికథా కాలక్షేపమున కుద్యమించినట్లున్నది ఔరా! తెలిసె. ఈ రాజేంద్రుఁడు జాగరమునాఁడు తానే హారికథచెప్పుటయుఁ గలదని తోఁచెడు ఇది యాశ్చర్యకరమైన విషయమే? చూచెదఁగాక యెట్టివేడుక జరుగఁగలదో? (ప్రక్కనఁ గూర్చుండును)

(వెనుక యవనికనెత్తఁగా- మృదంగాది వాద్యములవెంట రుక్మాంగదుఁడు హరికథోద్దేశమున గాన మొనర్చుచుండును జనములునుండురు రుక్మాంగదుఁడు హరికథా కాలక్షేప విధానముగా నుపన్యసించును పిదప ముందటి యవనికపడును)

మోహిని—(ముందటికివచ్చి) ఆహా! ఏమి యీ రాజేంద్రుని విష్ణుభక్తియు గానవైశద్యముసు, నద్భుతముగా నున్నవియే! తానే యిట్లుపన్యసించుచు జనులకెల్ల ముక్తిమార్గము గఱపుచుండ జనుల యాత్మలు వైకుంఠమున కరుగుటయరుదా? ఈ రాజేంద్రవరేణ్యుఁజూడ నేను పైవేసికొనియున్న కుహక మోహామంతయుఁదీటి నిక్కంపు మోహ ముప్పతిల్లుచున్నది అయినను జూచెద ఈరాజు నెట్లు మరులుకొలుపవలయునో యావిధానమే తోఁచకున్నది అతనియింటికి నేనేపోయి కనిపించుకొంటినా, పలుచఁదనమునకుఁ గారణముగు ఇంకెట్లు చేయవలయు? ఆరాజు నను జూచు విధానమైననెయ్యది? ఇతనికి గానమునందు మిక్కిలి ప్రీతియాటచే గానమూలముననే యితనిమనసు గరఁగింపవలయు దైవభక్తి మెండగుటచే నేనును నెక్కుడుగా దైవభక్తి గలిగియున్నట్లు నటించి మదికెక్కవలయు.

[ప్ర: (మాటలాడుకొనుచు) నిరువురు పౌరులు.]

1. పౌర—ఓరీ రాజుగారు మాత్రమే పెడలుదురఁట అమ్మగారు పోవరఁట, వినలేదా?

మోహిని—(స్వగతము) రాజుగారెక్కడకుఁ బోవుదురు, అమ్మగారేలపోరు?

2 పౌర—అయ్యగారును పోయియుండిన మాకేకాక మహాయాజులవాండ్రకు సహితము వాయనములు లభించియుండెను.

1 పౌర—ఒక్కొక్క ఘటమునకొక్కమాడ నొసఁగున దక్షిణలిచ్చెదరు వినలేదా?

2 పౌర—తెలియునులెమ్ము నేఁడు క్రొత్తగాఁ జెప్పెదవా? ఎప్పటికి నిక్కమేకదా?

(మోహిని ముందఱికివచ్చి).

మోహిని—బ్రాహ్మణోత్తములారా! రాజుగారెక్కడకుఁ బోయెదరు? ఎప్పుడు పోయెదరు?

1 పౌర—నీది యేయూరు?

మోహిని—నేను పరస్థలమునుండి వచ్చియున్నవాఁడను.

1. పౌర—ఎంత పరస్థలమైనను మాఘమాసములో శివరాత్రి వచ్చుచుండఁగా, మారాజుగారు వింధ్యాచల ప్రాంతమునఁ జంద్రమౌళీశ్వరుని కయుత ఘటాభిషేకము చేయించుమాట తెలియదన్న నేమనవలయు.

మోహిని—ఓయయ్యా! నేను దూరదేశమునకుఁ బోయియుంటిని గాన వినలేదు శివరాత్రి మూఁడుదినములమాత్రమున్నదే ఇంకెప్పుడు వెడలెదరు

1 పౌర—మారాష్ట్రమునుండి యీ వృత్తాంతము తెలియదన్న నీ వెవరవో? నీతో మాకేమిమాటలు పొమ్ము

(పౌరులు నిష్క్రమింతురు)

మోహిని—ఇంతమాత్రము తెలియవచ్చెఁగదా? నేను మున్ముందుగా నక్కడకే పోవుదును, (నిష్క్రమించును)

:[ తృతీయాఙ్కము సమాప్తము. ]:—

———0———

శ్రీ

# మోహినీరుక్మాంగద నాటకము.

———:0———

## చతుర్థాఙ్కము-ప్రథమరంగము.

వింధ్యపర్వతములోని యిష్టకామేశ్వరాలయము.

[ప్ర. మోహిని.]

మోహిని—మొన్ననే చతుర్దశి అయుత కుంభాభిషేక మీ స్వామికి జరిగినది. పూజా విధానములన్నియు ముగిసినవఁట ఈనాఁటివఱకు నాకా రాజేంద్రుని జూచుటకాస్పదము కాలేదు. నేఁడీ స్వామియొద్దకు నా మహీశుఁ డేకాంతసేవకు వచ్చునఁట. ఇప్పుడు తప్పిన నింక సంవత్సరమువఱకు సమయ మొదవదు. సంగీతకళానిధియు, భాగవత శిఖామణియు, ధర్మమార్గ ప్రవర్తనాపారీణుఁడునునైన యీ రుక్మాంగదుపై నాకేల యింత భక్తిపూర్వకమైన మోహము సంభవించినది! కపటమోహము పూని నాలుగుదినములు కార్యము చూచుకొని వ్రతభంగ మొనర్పఁబోవ నుద్దేశించి యున్న నాకు నిటు నిక్కంపుమోహమున్న నే నేమి కార్యము చేయఁగలను?

(లోపల రుక్మాంగదునిధ్వని « మీరక్కడనే యుండుఁడు ».)

మోహిని—అదిగో! వచ్చుచున్నాఁడు ఇంక నా కార్యమునకుఁ బ్రారంభింతును.

(అని వీణ పెట్టుకొని).

సీ. అంభోజభవ సురేంద్రార్చితచరణాయ
మరణదూరాయ నమశ్శివాయ
పద్మాస్త్రకోటిప్రభా దివ్యదేహాయ
మఘసంహారాయ నమశ్శివాయ
డమరుత్రిశూల ఖడ్గ కపాలహస్తాయ
మథితదోషాయ నమశ్శివాయ
గగనకల్లోలినీకలితోత్తమాంగాయ
మౌళిచంద్రాయ నమశ్శివాయ

తే. గీ. మౌనిసంసేవితాయ నమశ్శివాయ
మదనదర్పహారాయ నమశ్శివాయ
మధువిరోధిశరాయ నమశ్శివాయ
మంత్రరూపాత్మకాయ నమశ్శివాయ.

ప్ర॥ రుక్మాంగదుఁడు (దూరమున).

రుక్మాంగ—(గానము నాలకించి) ఏ మీ గానచాతుర్యము! ఇట్టికాలమున, నెవ్వరీ యుమేశపూజకు వచ్చియున్నారు? ప్రత్యక్షముగాఁ గోకిలయే గానము నేర్చి పాడుచున్నట్లున్నదే! ఇంకింత వినుదును

మోహిని—

కం॥ శూలిన్ గపాలమస్తక
మాలిన్ నయశాలిఁ జంద్రమౌళిన్ గ్రతుని
ర్మూలిన్ సుగుణాలిన్ శుభ
శీలిన్ సారంగచర్మచేలిన్ గొలుతున్.

రుక్మా—ఆహా! వీనులవిందై యీగాన మింతానంద మొనగూర్చునే! లోనికిఁబోయి యెవరో తిలకింతునా? పూజాభంగ మొనర్చితినని యీనారికిఁ గోపము గలుగునో!

మోహి—సీ. నీటఁదేలుశరంబు పాటసోలురసంబు
ధరియింపభరియింపఁ దలఁపఁడేని
ఉబ్బిపాటెడియాలు బెబ్బులిబలుతోలు
జడలందునొడలందుఁ బడయఁడేని
యుగిముగాల్చినచేదు జగముగెల్చినజోదుఁ
గడినేయఁబొడిసేయఁ గలుగఁడేని
అలివేణివలిచంట వెలలేనివలియింట
నుండఁగాఁబండఁగా నోపఁడేని

గీ. ఈడువత్తురె మీసాటి కితరమూర్తు
లవనిమండలి దేవవేశ్యాభుజంగ
త్రిపురసంత్రాస జాహ్నవీతీరవాస
క్లేశభవభంగ యిష్టకామేశలింగ.

రుక్మాంగ—ఆహా! ఏమి యీస్వరవైఖరి! ఎందెందును నేను వినియుండలేదుగదా పూజాభంగమైనసుమానె. ఇంకేమైనమానె పోయి చూచివత్తును (మెల్లఁగా లోనికిఁబోయి మోహినినిజూచి, దిగ్భ్రమము నభినయించి యొక్కింత సేపుండి వెలుపలికివచ్చి). అహా! ఎవ్వరీతరుణీలలామ! శచియో! రతియో! ఎవ్వరో యెఱుఁగఁ గదా? ఇది యేరాకన్నియయో యప్సరసయో తెలియదుగదా కాకున్న నేను చూచినవెంటనే నాకీతరుణిపై నింతవ్యామోహము పుట్టునా? ఇక్కడ నేయుండి యీలలన పూజావిధానమైన పిదప నిక్కడకువచ్చిన నా యెట్లయినఁ జేసి మాటలాడించి చూచెద.

సీ. కందుచెందనిసుధాకరపూర్ణబింబంబు
మెఱసిపాఱకయున్న మెఱుపుఁడఁగె
పంకంబునందుఁ గీడ్పడనిమృణాళముల్
కవవిచ్చిచననిజక్కవయుగంబు
వికసించిమొగడనివిమలాంబుజాతముల్
కర్కశంబులుగానికరికరములు
చిలుకముక్కంటనివలఁతిబింబఫలంబు
తతకాంతిఁబాయనిదర్పణములు

గీ. అనఁగ నాననంబు నంగంబు హస్తముల్
చన్నుదోయి వాలుగన్ను లూరు
లలఁతిమోవి చెక్కు లలరు నియ్యరవిందగంధి యెచటనుండు కాంతయగునొ.

ఆతరుణి యచ్చరవేలఁదియైయున్నఁ బూజావిధానమైన పిదప నట్టే యంతర్ధానముఁ జెందిన గతియేమి? లోనికిఁబోయి యిప్పుడే మాటలాడించెద యేల భయపడవలయును! (లోనికిఁబోవ నుద్యమించి) వలదు. వలదు. అది దుడుకుతనమగు దేవాలయమున శైవధ్యాన మొనర్చుచున్న యాతరుణీమణి యెవ్వరైనది యెఱుఁగక ప్రార్థనాభంగ మొనర్చి మాటలాడించుట పాడిగాదు ఈ యెడ నేయుండి తిలకించుచుండెద. ప్రార్థన నిలిపినా పోయి ప్రశ్న మొనర్చెద. ఇంతలో నంతర్ధానమయ్యెనా దినదినము నిందే యుండి యెన్ని యేండ్లయినను మానక యాతరుణిమణి సందర్శన మిచ్చువఱకు మానకుండెద.

మోహి—సీ. గంగానదీ జూట కైరవాప్త కిరీట
శమనకవాట పశ్యల్లలాట
వ్యాఘ్రాసురాఖేట వనజాసనకరోట
విబుధపర్వతకూట వేదపాఠ
మృత్యువక్త్రచపేట మిహిరపాదాశాట
జితకాలకూట యానతవిరాట
దూరీకృతారాట త్రుటితకుంభినిశాట
వరభక్తసంఘాట వజ్రఖేట

గీ. వాఙ్నిరాఘాట దురితపావకకృపీట
ఘనభుజాస్ఫోట భూమిపంకజవరాట
తాపసస్తోత్రవాచాట దక్షపాట
భీమశివలింగ హాటకస్తోమపోట.

(కొంచమూరకుండి) ఆహా! ఆ ధరణీశవరుఁడు నన్ను దిలకించి యట్టే వెలికిఁబోయెను. మరల రాఁడయ్యె ఏమి కారణమో? నే నేపోయి దర్శించుకొందు. (వెలుపలికి రాఁ బ్రయత్నింప)

రుక్మా—(స్వగతము) ఆహా! గానము నిలిపినట్లయ్యె ఇంకఁబోయి విచారింతును. (లోపలికివచ్చును).

మోహి—ఎవరు మీరు?

రుక్మా—తరుణీ! నేను రుక్మాంగదుఁ డను పేరఁబరఁగు ధరావిభుఁడ ఎండిన చెట్టైనను జిగిరించి యొలర్చురీతి మనోహరగానమున నీయుమానాథు స్తుతించుచు దిక్కులనెల్ల మిఱుమిట్లు నించు తేజమున విలసిల్లు నీ వెవ్వరవు? (స్వగతము) హృదయమా! సంభ్రమింపకుము అయ్యో! ఈ తరుణీమణి తానెవ్వరని చెప్పుచున్నదో గదా?

మోహి—రాజేంద్రా! నే నెవ్వరైన నదియు నెఱిఁగి కార్యమేమి? జనసంచారములేని యీ శైలభూమి భాసిల్లు నీయిష్టకామేశపూజకే తెంచియున్నదాన నిక్కడను జనసంచారముండు భంగి యెఱిఁగితి. రాజేంద్రా! నీ విక్కడ కేలవచ్చితివి?

రుక్మా—కామినీ! నేను నేఁడు క్రొత్తగ వచ్చినవాఁడనుగాను. ఇప్పుడు బహుదినములనుండి ప్రతి యేఁడును సంవత్సరముల కొకసారి శివరాత్రినాఁ డీదేవునకు నయుత

ఘటాభిషేకమును జేయుచుండుటచే మొన్న శివరాత్రి యభిషేకమునకు శివదర్శన మున కేతెంచితి భామామణీ! నీవు దేవవనితె వేయగుదువు కాని యితరముకాదు. ఈ యెడకు దేవత లెవ్వరును వచ్చినవారి సందర్శించి యెుఱుఁగ అనుగ్రహించి చెప్పుమా నీ వెవ్వగవు ? ఏల యిక్కడకు వచ్చితివి ?

మోహి—రాజచంద్రా! నేను మోహిని యను పేరంబరఁగు నప్సరసను నేనును దేవ దర్శనమునకై—

రుక్మా—ఆహా! కాంతామణీ! నీవప్సరసవు కాకుండిన నొరులకు నిట్టి రూపవైభవ ముండునే? నీసందర్శనము లభించుటకు నెన్ని యజ్ఞములో యొనర్పవలయుఁగదా? నేనెంత ధన్యుఁడనైతిని రమణీ! మనమున నున్నమాట నిక్కముగా వచింతునా? నిన్ను జూచినప్పటినుండియు నెనలేని వ్యామోహము నాకుఁగలిగె. నీవనుగ్ర హింపకున్న నాజన్మమే నాకుపలదని నిస్పృహ జనింపఁగలదు. అనుగ్రహించి నీ యాశ్లేష సుఖము నాకు నొసంగుదువా ?

మోహి—(స్వగతము) ఒక్కింత వేడుక యొనర్చెద. (ప్రకాశము) రాజేంద్రా! ఇదియా పురుషులమాట? ఎన్నఁడును జూడక యాకస్మికముగఁ జూచినంతనే మోహించుచున్న మోహించుటయే కాక మోహించితినని కొంకులేక వచించుచుఁ దారతమ్యము గణింపక యాతీరున సరసపు మాటలాడుట రాజధర్మమా ?

రుక్మా—రమణీ! నీయాన నిక్కముపచించెద నిన్ను మోహింపకుండుటకు నిన్ను దర్శించిన పురుషుల కెవ్వరికైన సాధ్యమగునా ? నిన్నుఁ జూచినప్పుడే నాకు దిగ్భ్రమముగలిగి పరవశతప్రాప్తించె.

సీ. చక్రవాకులమించు నవతురాదనిమించు
వలిగుబ్బచనుదోయి చెలువుచూచి
నిండుచందురుకాంతి నిరసించునల్లంత
మొలకనవ్వులముద్దుమోముచూచి
యింద్రనీలపురంగు నెరపునేయఁగడంగు
కుటిలకుంతలములకొమరుచూచి
మరుబాణములయేపు నెరపునేయఁగనొప్పు
నిడువాలుగన్నుల కడిమిచూచి

సీ. సోలపుమోమున నెలవంక భామలఁజూచి
ఇందఱుకొత్తుబింబాధరంబుచూచి
... గోలుమృదుహస్తములనుజూచి
... ఖండంగ నెంతటివాఁడనబల.

కీ వెన్నరి వని ... ర్వరి గృహిణివగుదువో యను సంశయము వొడమినందునఁ ... దొ(ట్రుపాటుగలిగె. నీవచ్చరవై యుండఁగూడదా యని మిక్కిలి ... చ్చరవేమై యుండుట నాభాగ్యమేకదా! పౌండరీకాది ... ఘోరయుద్ధమున మరణము జెందినవారికిని గాక నినుబోలు నప్పరల సహవాసము లభింపదనుట నేని యెఱుఁగుదును. అయినను మదనువాఁడి బాణములఁ ... యీప్రార్థన మొనరించెద, రమ్ము నన్ను ధన్యుఁ జేయుము. నాకుఁగల ఐశ్వర్యము నెల్ల నిప్పుడె నీకుగా భావించి నా కేలిక హానివి గమ్ము ...! నీవు ఇడసిన ...

చ. మొగలిపూసౌరభమ్మొదలమూఁకకు గంధపుగాలిరాకకున్
మకరందపతాకకును మామిడిమోకకుఁ జంద్రుకాకకున్
బికములపల్కకున్ సిరులఁ బేర్చినయామనిగుచ్చునికకున్
జకితమృగాక్షి యోర్వ నిఁకఁ జాలఁ గృపామతి నాదరింపుమా.

కుసుమ కోదండుఁడు మననీఁడు ఏదీ! నీమనోహరాలింగనమిమ్ము.

మోహి.—రాజేంద్రా! ఇట్లొనర్చుటవలన నీగౌరవమునకు హానికలుగదా? కన్నవారికై వీచి పలిచినంతనే కలియఁగల కామిని యంచు నన్నెంచితివా? ఊరకుండుము నాకుఁ గోపముగలుగు. నాదారిని బోనిమ్ము.

రుక్మా.—మారనారాచములఁదూలి కడగానని యాపదఁ బ్రాణములఁ ద్యజింపనున్న నన్ను నీయధరామృత పానమునఁజేసి రక్షించుటకంటె నీకింకొక దారిగలదా? కామినీ! నన్నుఁ దెగడకుము. ఆరగంటఁ జూడకుము నిన్నే నమ్మియున్నాను. నీకంటె నితర మెఱుఁగను. నాకుఁ గలవన్నియు నీకే యర్పించెద.

మోహి.—ధరణీధవా! నన్నిట్లు బాధపెట్టసాగితివి. దేవలోకమున విచ్చలవిడిగాఁ దిరుగాడుచు దేవేంద్రు ననుగ్రహమునకుఁ బాత్రులమైయున్న నన్నుఁ బోలిన యచ్చరలు భూమికేతెంచి నీ వెంత రాజవైనను నిన్నుఁబోలిన యొక్కరి వశమున మెలఁగుట దగునా? ... కోరికలు నై నన్ను విడువుము. నీకు శుభమగును. పోయివచ్చెద.

రుక్మా—తరుణీ జనావతంసమా! నీకిట్టి నిర్దయయుండునే? నీవనుగ్రహింపకున్నఁ బ్రాణములు వాయుగునని చెప్పుమాట యతిశయోక్తిగదు ఔపచారికముగాదు. వాయాన నిక్కము ఏల నన్ను నిరాదరణ మొనర్చి పోవనెంచెదవు

## అనుబంధము 11.

నిన్ను నమ్మిన యొకప్రాణిని బ్రాణాపాయమువలనఁ దప్పించుటకు నింత యుపేక్షయా? నీ చరణములంటి వేఁడెదను నినుమానను

మోహి—ఆహా! రాజన్యా! ఇదియేమి నీయుపేక్ష. దేవవనితనైన నేను నీతో నెట్లు మెలఁగనేర్తు. అంతఃపురమున నెందఱో నీకుఁ దరుణులున్నవారే వారి కనుచర భావమున నేనెట్లుండనేర్తు ఇది కానిపని నీకుఁ దెలియదా? ఊరక దేవదర్శన మొనర్చి నీదారిఁబొమ్ము

రుక్మా—రమణీమణీ! నీవె నన్నింత కటాక్షించితివా! నాయనుతులఁ బుత్రుని నా సర్వస్వమును నీయాధీన మొనర్చువాఁడ. నీమాట జవదాటక మెలఁగువాఁడ

మోహి—రాజేంద్రా! మోహమునఁ గన్నుగానక కార్యసాధనమునకై యేమేమో వచియింపవచ్చుఁగాని యనియన్నియు జరుపుటకగునా? నీవపేక్షించినది క్షణిక సౌఖ్యము అది లభించినవెంటనే యభిలాషలన్నియుఁ గడమట్టఁబోవు తరువాత నొకవిధమగు మోహముండఁగలదా? ఏల తెలియనిభంగి మాటలాడెదవు అన్న మాటంతయు నీకు జరుపుటకు సాధ్యమగునా?

రుక్మా—కామినీ! నాసదుద్దేశము సంశయించిన మాటలాడి నీవు నాకెంతయుఁ దప్పొనర్చితివి. అదే! అంగన్న యిష్టకామేశు పాదపద్మములాన వచించెద. నీమాట నేజవదాటువాఁడఁగాను. ఏల నన్నింతి పరీక్షించెదవు? నను నీకృపకుఁ బాత్రునిగాఁ జేయుమా?

మోహి—ధరణీవరా! నీకెందఱో తరుణులుండురే? పుత్రుఁడును నున్నవాఁడని నీవాడిన మాటవలనఁ దెలిసె. నీదారలతోఁగల యనుభోగము చాలదా? చూచిన వారినెల్లను రూపులైన మాత్రమున నేయేమి? ఇటు కలయఁగోరుట ధర్మమా? ఈ యాచరణము నీభార్యలు సమ్మతింతురే? నీకుసుఖమా? నాకుసుఖమా? వదలుము నీకోరిక

రుక్మా—మోహినీ! నాభార్యలెల్ల నేఁగోరినవెంటనే నీకుఁ జరణదాసులుగా నుండుటకు నామోదింపఁ గలరు. నాపుత్రుఁడు నీపుత్రుఁడేయగుఁగదా? ఇంకేల నీవిషమ పరీక్ష! ఎట్లును నను గృతార్థుఁజేయక నీవుఁ దప్పదు. ఆపరమేశునాన వచించెదను. నిన్నుమాని వనితాంతరప్రసక్తి నే నిచ్ఛయింపను.

మోహి—పరమేశా! ఇష్టకామేశా! నినుదర్శించి పూజయొనరింప వచ్చియున్న నాకు నెట్టి తగులము ఘటించితివి?

